N. అనంత పద్మనాభం

# శ్రీ వృషనామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గమ్

## 2001 - 2002

ప్రచురణ



**తిరుమల తిరుపతి దేవస్థానములు**

తిరుపతి

శ్రియైనమః

శ్రీ మహాలక్ష్మీ గణపతయే నమః

శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరాభ్యాం నమః

# శ్రీ వృషనామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గమ్

## 2001 - 2002


తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాన్తి,

శ్రీ తంగిరాల ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతిగారిచే విరచితము.






తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన పణ్డితులు

అప్పికట్ల శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులవారిచే పరిష్కృతము

తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

మహారాజశ్రీ పి. కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్., గారిచే ప్రకటింపబడినది.

తిరుపతి

2001

శ్రీ వేంకటేశ భగవాన్



ఓమ్॥ మత్పాదౌ శరణం వ్రజేతి చరణౌ సంసారసిన్ధుస్తథా
జానుం సంస్పృశతీతి జానుమపి పాణిభ్యాం స్వయం దర్శయన్।
శేషాద్రౌ జగతోఽస్య రక్షణధియాఽఽ తిష్ఠద్దయా సాగరః
సచ్ఛ్రేయాంసి చతుర్భుజః కలయతాం శ్రీ శ్రీనివాసః ప్రభుః॥

కీ.శే. శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః
తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాన్.

# శ్రీ వృషనామ సంవత్సర

## సిద్ధాన్త

## పంచాఙ్గమ్



*పంచాంగకర్త :*

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థానసిద్ధాంతి అగు

కీ.శే॥ దైవజ్ఞశేఖర బ్రహ్మశ్రీ తంగిరాల చినహనుమత్సిద్ధాంతిగారి కుమారుడు

**శ్రీ ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతి**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి

(శ్రీ పూర్ణ జ్యోతిర్నిలయం)

రేలంగి, తణుకు తాలూకా

పశ్చిమ గోదావరిజిల్లా (ఆంధ్ర)

STD : 08819 ఫోన్: 37064

శ్రీ పద్మావతీ దేవి



ఓమ్।। ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్స్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతి సంవర్ధినీమ్।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్।।

శ్రియైనమః

శ్రీనివాసాయ నమః

శ్రీమద్వైఖానసమహాగురుభ్యో నమః

# శ్రీ వృషనామ సంవత్సర పంచాఙ్గ విషయసూచికా

గమనిక: ఈ పంచాంగము నందలి తిథి, నక్షత్ర, యోగ, కరణముల సమయముల అంత్యమును, అమృతాది, గ్రహప్రవేశ సమయముల ప్రారంభమును, వర్జ్యములు ప్రారంభాంత్యమును తెలుపును.



* * *

శ్రీ మహాగణాధిపతయేనమః

# నిత్యధ్యాన శ్లోకములు

| | | |
|---|---|---|
| శ్రీ గణేశ స్తోత్రం: | శ్లో॥ | శ్రీమద్గణేశం విధిముఖ్య వంద్యం గౌరీసుతం విఘ్నతమోదినేశం।<br>కళ్యాణ సంవర్ధిత భక్తలోకం సర్వార్థ సిద్ధ్యర్థమహం భజామి ॥ |
| శ్రీ సరస్వతీ స్తోత్రం: | శ్లో॥ | సరస్వతీ త్వియందృష్ట్యా। వీణాపుస్తకధారిణీ।<br>హంసవాహన సంయుక్తా। విద్యాదానకరీమమ॥ |
| శ్రీ వేంకటేశ్వర స్తోత్రం: | శ్లో॥ | శ్రియఃకాన్తాయ కళ్యాణ । నిధయే నిధయేఽర్థినాం।<br>శ్రీ వేంకట నివాసాయ। శ్రీనివాసాయ మంగళం॥ |
| శ్రీ గురు ప్రార్థన: | శ్లో॥ | నిత్యానందైక కందాయ। నిర్మలాయ చిదాత్మనే।<br>జ్ఞానోత్తమాయ గురవే। సాక్షిణే బ్రహ్మణే నమః॥ |
| శ్రీ విఖనసాచార్య స్తోత్రం: | శ్లో॥ | శ్రౌతస్మార్తాదికం కర్మ। నిఖిలం యేన సూత్రితం।<br>తస్మై సమస్త వేదార్థవిదే। విఖనసే నమః॥ |
| నవగ్రహ ప్రార్థన: | శ్లో॥ | ఆదిత్యాయచ సోమాయ। మంగళాయ బుధాయచ।<br>గురు శుక్ర శనిభ్యశ్చ। రాహవే కేతవే నమః॥ |
| పరమ భాగవతోత్తములు: | శ్లో॥ | ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక।<br>భీష్మ దాల్భ్యాన్, రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్ పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥ |
| గోమాత ప్రార్థన: | శ్లో॥ | గావో మేమాతరస్సర్వా। గావోమే పితరస్సదా।<br>గావో మమాగ్రతస్సంతు। గావోమే సంతుస్పృష్టతః।<br>గావోమే పార్శ్వతస్సంతు। గవాంబృందేవసామ్యహం॥ |
| బిల్వవృక్ష ప్రార్థన (మారేడు): | శ్లో॥ | త్రిదళం త్రిగుణాకారం। త్రినేత్రంచ త్రియాయుషం।<br>త్రిజన్మ పాపసంహారం। ఏకబిల్వం శివార్పణం॥ |
| అశ్వత్థ ప్రార్థన (రావిచెట్టు): | శ్లో॥ | మూలతో బ్రహ్మరూపాయ। మధ్యతో విష్ణురూపిణే।<br>అగ్రత శ్శివరూపాయ। వృక్షరాజాయతే నమః॥ |
| సంధ్యా దీప ప్రార్థన: | శ్లో॥ | శుభం భవతు కల్యాణీ। ఆరోగ్యం ధనసంపదం।<br>మమశత్రు వినాశాయ। సాయం జ్యోతిర్నమోస్తుతే॥ |
| పరాశర ప్రార్థన: | శ్లో॥ | ధర్మజ్ఞం ధార్మికం ధీరం। ధర్మాత్మానం దయానిధిం।<br>ధర్మశాస్త్ర ప్రవక్తారం। పరాశరమునింభజే॥ |
| చంద్ర దర్శనం (నెలపొడుపు): | శ్లో॥ | క్షీరసాగర సంపన్న। లక్ష్మీప్రియ సహోదర।<br>హిరణ్య మకుటాన్ భాస్వత్। బాలచంద్ర నమోస్తుతే॥ |
| తులసీ ప్రార్థన: | శ్లో॥ | యన్మూలే సర్వతీర్థాని। యన్మధ్యే సర్వదేవతాః।<br>యదగ్రే సర్వ వేదాశ్చ। తులసీంత్వాం నమామ్యహమ్॥ |
| సూర్యస్తవం: | శ్లో॥ | ఉదయే బ్రహ్మరూపశ్చ। మధ్యాహ్నేతు మహేశ్వరః।<br>అస్తకాలే స్వయం విష్ణుః। త్రిమూర్తిశ్చ దివాకరః॥ |
| నిద్రలేచునపుడు (భూ ప్రార్థన): | శ్లో॥ | సముద్ర వసనే దేవీ। పర్వతస్తన మండితే।<br>విష్ణుపత్ని నమస్తుభ్యం। పాదస్పర్శం క్షమస్వమే॥ |
| కర దర్శనం: | శ్లో॥ | కరాగ్రే వసతే లక్ష్మీః । కరమధ్యే సరస్వతీ।<br>కరమూలే స్థితా గౌరీ। ప్రభాతే కరదర్శనం॥ |

* * *

శ్రీరస్తు

శ్రీలక్ష్మీ వేంకటేశః ప్రసన్నో భవతు

శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# పీఠికారంభః

ఓమ్॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥
యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాఃపరశ్శతమ్।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥
శ్రీమాన్ శ్రీ శేషపృథ్వీ ధరశిఖరపరిస్పందిపాదారవింద–
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్వాన్తనస్సంత నోతు॥
లక్ష్మీం లక్ష్మీ వియోగాసహ నిజహృదయఃకో౽పి కారుణ్యపూర్ణో
దేవాధీశఃప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదోనః॥
కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠ ముదారహారమ్।
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్॥
మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా।
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే॥
శ్రీ విష్ణుచిత్తకుల నందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందన యోగదృశ్యామ్।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే॥
విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్।
కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్॥
ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః।
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః।
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః।
ధైర్యం రాహుశ్చకీర్తిం సకలశుభ యుతాం కేతురిష్టార్థ సిద్ధిమ్॥
అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్। వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః॥
శ్రీ వేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్। నమస్కృత్యహృషీకేశం యతిరాజం చ నిత్యశః॥
సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః। దద్యుర్మనోరథం సర్వం దేవతాఃఫలముత్తమమ్॥
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్। చంద్రార్కౌ తత్రసాక్షిత్వం భజేతేనిశ్చలంయతః॥
యథాశిఖామయూరాణాంనాగానాంమణయోయథా। తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్ని సంస్థితమ్॥
శ్రీవత్స జన్మా౽ఖిల సౌరతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిప్ర నూమాన్।
శ్రీ తంగిరాలాన్వయజో౽హ మార్యః శ్రీ శేషశైలేశ కృపావిశేషః॥
సో౽హం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్।
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు॥

గురువందనమ్

దైవజ్ఞ ప్రథమస్య పూర్ణ యశసశ్శ్రీబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీ పిడపర్తి వంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ।
సూర్యార్యాది పురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్త్రిస్కంధాంబుధిపారగం మమ గురుం వందే సదాశ్రేయసే॥

దైవజ్ఞ ప్రశంసా, దైవజ్ఞ నివాసః

శ్రీ వేంకటేశా ప్పన్నసింహతాట కేశాదిదేవై రభిరక్ష్యమాణమ్॥
గోదావరీ పశ్చిమయోజనాంత శ్రీగోస్తనీతీర విరాజమానమ్॥
శ్రీవేదవేదాంగ విదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండితైశ్చ॥
ఈడ్యైర్వదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్॥
యద్వంశే బహవశ్శ్రుతిస్మృతివిధౌ సజ్జ్యోతిషే పండితాః।
శ్రీవత్సాభిధగోత్రజాస్త దనుమత్త్రైతామహో ఽత్యంతధీః॥
శ్రీమత్పండిత సార్వభౌమ హనుమాన్వేదార్థవిత్సాత్త్విక-
స్తత్తత్కర్మసుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా॥
తస్యాత్మజో వేంకటకృష్ణ సోమయాజీసుసిద్ధాన్తవిదగ్రగణ్యః
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ
జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వైతీయీకస్తు పూర్ణదైవజ్ఞః
తార్తీయోఽహం హనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః
చత్వారస్తనూజాః హనుమత్సిద్ధాంతినః తృతీయస్తేషు
ప్రభాకరపూర్ణశర్మాహం శ్రీనివాసకరుణాకాంక్షీ
అసూర్యం చ్యవనోంగిరోఽత్రి ముఖరానభ్యర్చ్యమాన్యాన్మునీ
నాచార్యానపరాన్మయా సుమనసా శ్రీతాతపాదం గురుమ్
పంచాంగం విరచయ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
సశ్శ్రేయాంసి దయామయః కలయ తాం శ్రీ వేంకటేశః ప్రభుః॥

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి.

## శ్రీ తిరుపతి (వేంకటాద్రి) నగర్యాః

విషువచ్ఛాయాంగులాని 2-55 　　　　　　　　　　　　　　　　అక్షాంశాః +13.44

భూమధ్యాత్ దేశాంతరకాలః ఘ। 0-29 గం. +0-12 ని॥ లు 　　　　　　అయనాంశాః భా. 23-51-26

　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　వార్షికాయన గతిః 0-0-54

**స్ఫుటలగ్న ప్రమాణ, పుష్కరకాలాః**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | 4-28 = | 3-7 | సింహస్య | 5-10 = | 3-38 | ధనుషః | 5-19 = | 3-43 |
| వృషభస్య | 5-4 = | 2-22 | కన్యాయాః | 5-6 = | 2-23 | మకరస్య | 4-44 = | 2-13 |
| మిథునస్య | 5-30 = | 4-24 | తులాయాః | 5-18 = | 4-14 | కుంభస్య | 4-14 = | 3-23 |
| కర్కాటకస్య | 5-28 = | 1-16 | వృశ్చికస్య | 5-31 = | 1-17 | మీనస్య | 4-8 = | 0-58 |

ఈ లగ్న ప్రమాణములు ఈ కాలమునకు తిరుపతికి చేయబడినవి. ఇవియే స్ఫుటలగ్న ప్రమాణములుగ గ్రహింపవలెను. తిరుపతి ప్రాంతంలోని అలవాటులో ఉన్న పాతలగ్న ప్రమాణములు ప్రాచీనకాలములో సాధించబడినందున పరిగ్రాహ్యములు గావు.

**తిరుపతి నుండి రాజమండ్రికి దేశాంతరకాలము**

| సాయనమాసము | మేష +32 | వృషభ +39 | మిథున +45 | కర్కాటక +48 | సింహం +45 | కన్యా +39 |
|---|---|---|---|---|---|---|
| | తులా +32 | వృశ్చిక +24 | ధనుః +16 | మకర +19 | కుంభ +16 | మీన +24 |

పై సంస్కార విఘడియలను తిథ్యాధికమునందు మేషాది సాయన మాసారంభ దినమున సంస్కరింపగా రాజమండ్రికి సూర్యోదయాది కాలమగును. మాసాది నుండి తిరిగి మాసాంతము వరకు అనుపాతముచే మధ్యదినములందు సంస్కరింపవలెను.

పరమ దినప్రమాణం 32-3, పరమ క్షయదిన ప్రమాణం 27-57.

* * *

శ్లో॥ సర్వజ్ఞః సకలామరార్చితపదస్సప్తాచలాధీశ్వరః,
సర్వాభీష్ట ఫలప్రదాన నిపుణః శశ్వత్ప్రసన్నాననః ।
వేదాన్తైరనుమేయ సుందరవపు ర్మోహాభిగమ్యస్సదా,
కళ్యాణం భవతాం కరోతు భగవాన్ పద్మావతీ వల్లభః॥

తా॥ సర్వజ్ఞుడును సమస్త దేవతలచే పూజింపబడు పాదపద్మములు కలవాడును ఏడుకొండలకు అధిపతియు సమస్తములైన (అందరి) కోరికలను నెరవేర్చుటయందు సమర్థుడును, చిఱునవ్వుతో విరాజిల్లు ముఖారవిందుడును, ''ధ్యేయ స్సదా'' ''ఆ ప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః'' మొదలగు ఉపనిషద్వాక్యములచే నూహింపదగిన సుందరమైన దేహము కలవాడును, పుంసాం మోహనరూపుడు గావుననే ఎన్నిమాఱులు చూచినను తనివితీరని వాడును, పద్మావతీ వల్లభుండునైన శ్రీ శ్రీనివాస భగవానుడు మీకు మంగళములను అనుగ్రహింతురుగాక.

శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులు
**అప్పికట్ల STD: 08643 ఫోన్: 70224**
**బాపట్ల మండలం- గుంటూరు జిల్లా.**

శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

# శ్రీ వృషనామ సంవత్సర పంచాంగము

శ్లో॥ బాలార్క కోటి ద్యుతిమప్రమేయం బాలేందురేఖాకలితోత్తమాంగం।
భ్రమద్ద్విరేఫావృతగండ భాగం భజే భవానీ తనయంగణేశం॥

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం
గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదాన తుల్యంన్నృణాం।
ఆయుర్వృద్ధిదముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం
నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం॥

## అథ బ్రహ్మణః ఆయుః ప్రమాణాదికం

శ్రీమద్భగవద్విష్ణునాభికమల జాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖ బ్రహ్మణః పరమాయుః వర్ష శతమేవ। తత్ప్రమాణ సౌరాబ్దాః 31104000 కోట్లయః। ద్వితీయ పరార్థే ప్రథమవాసరే గతఘటికాదయః ఘడి 17 విఘ 42 ప్రాణకాల(0) గుర్వ క్షరోచ్చారకాలః 3 నిమేషః 19లవత్రుటయః 3 సంప్రతి చతుర్థత్రుటౌ గతసౌర మాసాదయః 2,14,27,32 ఇదానీం శ్వేతవరాహ కల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః సప్తమే వైవస్వత మన్వంతరే 27 మహాయుగాని గతాని. అధునా 28 తమే మహాయుగే వర్తమానం కలియుగం వ్యవహ్రియతే.

''యుగంభవేత్ వత్సరపంచకేన యుగాని తు ద్వాదశ వర్షషష్ట్యాం'' అను ప్రమాణముచే ప్రభవాది 5 సంవత్సరములు ఒక యుగము చొప్పున (5x12=60) 12 యుగములుగా నగుచున్నది. ఇట్లుగ కృష్ణయజుర్వేద తైత్తిరీయ బ్రాహ్మణము 10 ప్ర। పాఠకము, 4వ అనువాకము చెప్పుచున్నది.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| సంవత్సరోఽసి, | పరివత్సరోఽసి, | ఇదావత్సరోఽసి, | ఇదువత్సరోఽసి, | ఇద్వత్సరోఽసి |

॥ ఇతి॥ ఇందులకు విద్యారణ్య భాష్యము.

ప్రభవాదిషు షష్టిసంవత్సరేషు ఏకైకస్మింశ్చక్రమేణ సంవత్సరపరివత్సరాది శబ్దాః వర్తన్తే ........................................ హే అగ్నేత్వం సంవత్సరోసి ప్రభవాది రూపోసి, పరివత్సరోసి – విభవ రూపోసి, ఇదావత్సరోసి – శుక్లరూపోసి, ఇదువత్సరోసి – ప్రమోదరూపోసి, ఇద్వత్సరోసి – ప్రజాపతిరూపోసి, పంచస్వేతేషు అనుగతాకారః వత్సరః ఏత్రద్రూపోసి.

ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం.

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "1. సంవత్సరము, 2. పరివత్సరము, 3. ఇదావత్సరము, 4. ఇదువత్సరము, 5. ఇద్వత్సరము" అను నామములు కలవై యున్నవి. ఇటులనే ప్రతి అయిదు సంవత్సరములకు నామములు తెలియదగియున్నవి. ఇప్పుడు ఇంద్ర దేవతాకమగు తృతీయ యుగమున (వర్తమానమున పంచవత్సరాత్మకమగు తృతీయ యుగమున) 5వది అగు రుద్రదేవతాక, ఇద్వత్సర నామముగల ఈ వృషనామ సంవత్సరమునందు రజితదానము విశేషపుణ్య ఫలప్రదము.

దయా సముద్రుడగు శ్రీ వేంకటేశప్రభువు అన్నియును శుభప్రదములుగను, సుఖప్రదములుగను ఉండునట్లు అనుగ్రహింతురుగాక.

* * *

| | | | |
|---|---|---|---|
| కలియుగాబ్దములు | 5102 | శ్రీ శంకరాచార్యాబ్దములు | 2073 |
| విక్రమార్క శకాబ్దములు | 2058 | శాలివాహన శకాబ్దములు | 1923 |
| హిజరీ శకాబ్దములు | 1421-22 | శ్రీరామానుజాబ్దములు | 984 |
| శ్రీమధ్వాచార్యాబ్దములు | 885 | భారత స్వతంత్రాబ్దములు | 54 |
| ఆంధ్రరాష్ట్రావతరణాబ్దములు | 45 | ఇంగ్లీషు | 2001-2002 |

## నవనాయక నిర్ణయము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రాజా | – | చంద్రః | సస్యాధిపతిః | – | చంద్రః | మేఘాధిపతిః | – | శుక్రః |
| మంత్రీ | – | శుక్రః | ధాన్యాధిపతిః | – | రవిః | రసాధిపతిః | – | బుధః |
| సేనాధిపతిః | – | శుక్రః | అర్ఘాధిపతిః | – | శుక్రః | నీరసాధిపతిః | – | చంద్ర |

*శుభులు 8+పాపులు 1=మొత్తం 9.*

## పురోహితాది ఉపనాయక నిర్ణయము

పురోహిత, గణక, పరీక్షకాది ఉపనాయక గ్రహములు శుభులు శుభఫలితములను, పాపులు పాపఫలితముల నిచ్చును.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పురోహితః | – | చంద్రః | అశ్వాధిపః | – | శుక్రః | రత్నాధీశః | – | చంద్రః |
| పరీక్షకః | – | చంద్రః | గజేశః | – | చంద్రః | వృక్షాధిపతిః | – | రవిః |
| గణకః | – | బుధః | పశూనామాధిపతిః | – | శుక్రః | జంగమాధిపతిః | – | చంద్రః |
| గ్రామనాయకః | – | రవిః | దేవాధిపతిః | – | చంద్రః | సర్పాధిపతిః | – | బుధః |
| దైవజ్ఞః | – | గురుః | నరాధిపతిః | – | శుక్రః | మృగాధిపతిః | – | గురుః |
| రాష్ట్రాధిపతిః | – | చంద్రః | గ్రామాధీశః | – | చంద్రః | శుభాధిపతిః | – | చంద్రః |
| సర్వదేశోద్యోగాధిపతిః | – | శుక్రః | వస్త్రాధీశః | – | బుధః | స్త్రీణామధిపతిః | – | శుక్రః |

*శుభులు 19+ పాపులు 2= మొత్తం 21.*

# శ్రీ వృషనామ సంవత్సర ఫలితము

చాంద్రమానము వలన ఈ సంవత్సరము 'వృష'నామ సంవత్సరమనియు బార్హస్పత్య మానముచే 'జయ' నామ సంవత్సరమనియు, గురుదయాబ్దముచే 'మార్గశీర్షాబ్ద' మనియు వ్యవహరింపబడును.

ప్రభవాది అరువది సంవత్సరములలో, పంచవత్సరాత్మకమగు 12 యుగములలో, ఇంద్ర దేవతాకమగు తృతీయ యుగమున ఇద్వత్సర నామకమగు (5వది), రుద్రదేవతాకమగు వృషనామ సంవత్సరమగుచున్నది. ఇందు రజితదానం విశేష పుణ్యఫలప్రదమైనది.

పగటియందు ఆర్ద్రా ప్రవేశము సస్యక్షయము. రాత్రియందు రవి మేషరాశియందు ప్రవేశించుటచే సస్యవృద్ధి, క్షేమము, సుభిక్షము సూచించును. ఆర్ద్రకార్తెకు ముందుగా తుఫాను, తొలకరి సూచించిననూ, ఆషాఢ ప్రారంభమున తొలకరించును. ఎరుపు భూములు, తెలుపు పంటలు, భాగుగా ఫలించును. రెండవ పంట విస్తారముగా ఫలించును.

ఈ సంవత్సరము నవ నాయకులలో ఎనమండ్రు శుభులైరి. 21 మంది ఉపనాయకులలో పంతొమ్మిది మంది శుభులైరి. కేవలం ముగ్గురు మాత్రమే పాపులైరి. ఇది చాలా విశేషము. గతములో ఎన్నడూ లేని విధముగా ఈ సంవత్సరము అందరకూ శుభాది పత్యములు కల్గుచున్నందున దేశ భవిష్యత్తు బంగారు మయమవుతున్నదని భావిస్తున్నాము.

జగల్లగ్నమును పరిశీలింపగా లగ్నము ధనుస్సు, లగ్న సౌఖ్య స్థానాధిపతికి శత్రు క్షేత్రస్థితి, సామాన్య వర్షములు, అతివృష్టి, అనావృష్టి వర్షములు కల్గుచుండును. సౌఖ్య స్థానమున సప్తమ రాజ్యాధిపతి బుధునికి నీచ, శత్రు లాభాధిపతి శుక్రునికి వక్రము మరియు ఉచ్ఛ స్థితి (నీచ భంగ రాజయోగము), లగ్నమున పంచమ వ్యయాధిపతి కుజునికి, అష్టమాధిపతి, ధన, మాన, ఉత్సాహ కారకుడయిన చంద్రునితో కలయిక దోషమైననూ కొంతవఱకూ మంచిది. లగ్నమునందు ఛండాలయోగము కల్గిన చంద్ర, గురులకు బలము లేదు. భాగ్యాధిపతికి ఉచ్ఛస్థితి కల్గినవి.

తద్వార ముఖ్యాధికారులు ఉన్నతాశయములు కలవారైననూ, వారిక్కినిర్వీర్యత స్తబ్దత కలుగును. మంత్రులకు, రాజాశ్రితులకు యోగభంగము. తూర్పు, దక్షిణ దేశములందు అరిష్టములు కల్గును. దేశపరిణామము అత్యంత ఉగ్ర, ఉష్ణ, చోర, శత్రు మార్గములందు నడచును. అందరూ తఱుచూ వైద్యులనాశ్రయించి ఔషధ సేవనము చేయుదురు. సామాన్యులకు ఉన్నతి కల్గుటచే, సమర్థులకు లోపము కన్పించును.

| బుశు | | | రా |
|---|---|---|---|
| | జగల్లగ్నం | | |
| | | | |
| ల చం కు కే | | | |

గు శ

| ల ర చం శు | | గు శ | రా |
|---|---|---|---|
| బు | వర్షలగ్నం | | |
| | | | |
| కే | కు | | |

వర్షలగ్నమున సౌఖ్య వ్యాపార గ్రహములకు వ్యయ స్థానము, వక్రస్థితి, లగ్న రాజ్యాధిపతి గురువు శనిచే కలయుటచే, వర్తక వ్యాపార సంఘముల వారు సమ్మెలు నిర్వహించుట, స్త్రీ పురుషులు శృంగారాది విలాసవంతులు అగుదురు. స్త్రీ సంఘపోరాటములు, కుల పోరాటములు అధికమగును. బంగారాది లోహములకు కొద్ది ధర హెచ్చి, నిలబాటుగా నుండును. నిత్యావసర వస్తువుల ధరలు హెచ్చును. వస్త్ర వ్యాపారులకు, రైస్ మిల్లర్లకు, అపరములు మిర్చి వ్యాపారులకు వాతావరణములు మిశ్రమముగా యుండును. అన్ని రకముల వ్యాపారముల వారికి సంవత్సర మధ్యమందు సమస్యలు ఇబ్బందులు ఎదురైననూ, సంవత్సర ఉత్తరార్ధము నుండి కలసి వచ్చును. వృత్తి పనివారలకు పరీక్షాకాలముగా యుండును.

భారత వర్షమున శుక్రమహాదశ నడుచుచుండుటచే ఇతర దేశములకంటె కీర్తి, ధనవృద్ధి, యాంత్రిక, సాంకేతిక వ్యాపారములు అభివృద్ధి చెందును. అంతర్దశాప్రభావముచే అధిక ధన దుర్వ్యయము, పరస్పర నేరారోపణములు కల్గును.

చైత్ర, వైశాఖ మాసములందు అధికార భంగములు, ప్రజాసంక్షోభములు కుజగ్రహయుతకాల సర్పాది దోషములచే అధికవేడి, జ్యేష్ఠ, ఆషాఢ మాసములందు కాలసర్పయోగము, గ్రహకూటములచే, ధరల ఆధిక్యతలు, దేశవిదేశములమధ్య సదభిప్రాయములు, వర్షాభావములు, స్వల్పముగా తొలకరించుట, శ్రావణమున అధిక జలప్రవాహములు, చాలా ప్రదేశములందు వరదలు, రాజకీయ అస్థిరత్వములు భాద్రపదమున రాజకీయ ప్రజా కల్లోలములు, మిశ్రమ వర్షములు. రోగారిష్టములు, గురు ఛండాలత్వముచే దైవిక కార్యక్రమములకు ఆటంకములు, ఆశ్వయుజమున రాజకీయ మిశ్రమ వాతావరణములు, ముఖ్యుల మార్పులు, ధాన్యం, బంగారాదులకు సమధరలు, సస్యోచిత వర్షములు, అపరములకు, కొబ్బరికి హెచ్చు ధరలు కార్తీక, మార్గశిరములందు సుభిక్షత, వ్యాపార సంస్థల అభివృద్ధి, ప్రజోపయోగ కార్యాచరణములుండును. పుష్యమందు ధరల వ్యత్యాసము, వాతావరణ కాలుష్య, ప్రాకృతిక భీభత్సములు, అధికారులు తగిన శ్రద్ధగైకొనుట, మాఘ ఫాల్గుణములందు వ్యాపారాభివృద్ధి, రవాణా, మార్గావరోధములు తొలగుట, ఆర్థిక సరళీకరణ మార్పులు, సస్య వృద్ధి, రాజకీయ అలజడి మున్నగు లక్షణములుండును.

మొత్తం మీద ఈ సంవత్సరం మే, జూన్, జూలై మాసములందు కుజ వక్రము, సంవత్సర ఉత్తరార్ధమున గురు శనుల వక్రము, గురు ఛండాలత్వము దేశాభివృద్ధికి భిన్నమయినవి. తప్పుదోవ పట్టించుచుండును. అయిననూ శుభ గురునికి సంవత్సరాంతమున ఛండాలత్వము తొలగి భవిష్యత్తులో స్వతంత్ర సంచారము కలుగుటచే అందరూ అభివృద్ధిగా, ఉత్సాహముగ యుందురు. దేశాభివృద్ధి కలిగి సుభిక్ష సస్యశ్యామల వంతమగునని భావించ వచ్చును.

ఈ సంవత్సరము కలియుగ దైవమైన తిరుమలేశునకు ఆశ్వయుజమున రెండు బ్రహ్మోత్సవములు జరుగును. లోకచక్రవర్తియగు సూర్యభగవానుడు, యుగచక్రవర్తి శ్రీ కృష్ణపరమాత్మ, కలియుగ దైవము శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరులు లోకమునకు శాంతి సౌభాగ్యములు, రక్షణ, సద్బుద్ధి కలిగింతురు గాక!

మంగళం మహత్      శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ      శుభం భూయాత్

## చాంద్రమానాబ్ద ఫలము

శ్లో॥ వివిధైరన్నపానాద్యైర్హృష్టపుష్టాంగ చేతనః।
మదోన్మత్తాఖిలాలోకాః వృషాబ్దేవృషసన్నిభాః॥

శ్రీ వృషనామ సంవత్సర అబ్దాధిపతి కుజుడు గాన అధికారులకు పీడ, ఛత్రభంగము, ధరలు నిలకడ లేకుండుట, వడ్లు, యవలు, గోధుమలు, అపరములు ఫలించును. ప్రజలు అనేక అన్నపానాదులచే సంతోషమును బొంది మదోన్మత్తులుగ వుందురు.

## బార్హస్పత్య మానాబ్ద ఫలము

శ్లో॥ శైలోద్యామ వనారామషరై రతులితో మహీ।

గీయతేవేణు వీణాద్యైర్జయాబ్దె కర్ణహార్యలమ్॥

ఇందు జయనామ సంవత్సర మగుటవలన ధాన్యములకు, పశువులకు ధరలు పెరుగును. పర్వతప్రాంతములు, తోటలు, అన్ని ప్రాంతములందు పండ్లు బాగుగా కాయును. పూవులు, కన్నులపండువుగ ప్రకాశించును. మతప్రచారములు అధికమగును.

## గురూదయాబ్ద ఫలము

శ్లో॥ సౌమ్యాఖ్యవర్షేశల భాండజాఖుమృగాదిభిశ్చాఖిలసస్యహానిః।

అత్యల్ప వృష్టిర్బహురోగపీడా భవంతి భూపాః కలహోత్సుకాస్యుః॥

ఇందు మార్గశీర్షాబ్దమగుటవలన అల్పవృష్టి వుండును. ఎలుకలు, పక్షులు, మిడుతలు ద్వారా పంటలు నశించును. ప్రజలకు చోరాగ్ని, శస్త్ర బాధలు, అధిక ధరలు, యుద్ధ భయములు వుండును. అధికారులకు పరస్పర కలహములు వుండును.

## సావన వర్షారంభ ఫలము

సావనవర్షారంభము 13-10-2001 శనివారమగుటచే మేఘములు తక్కువగ వర్షించును. ప్రభువులకు పీడ, దుర్భిక్షము, యుద్ధభయము కల్గుచుండును.

## కర్తరీ నిర్ణయము

| | |
|---|---|
| 4-5-2001 | వైశాఖ శుద్ధ ద్వాదశీ శుక్రవారం డొల్లుకర్తరీ ప్రారంభం. |
| 11-5-2001 | వైశాఖ బహుళ చవితీ శుక్రవారం కృత్తిక కార్తె నిజకర్తరీ ప్రవేశము. |
| 28-5-2001 | జ్యేష్ఠ శుద్ధ షష్ఠీ సోమవారం కర్తరీ త్యాగ మగును. |

## మౌఢ్యనిర్ణయము

| | |
|---|---|
| 4-4-2001 | చైత్రశుద్ధ ఏకాదశీ బుధవారం శుక్రమౌఢ్య త్యాగమగును. |
| | (25-3-2001 ఫాల్గుణ బహుళ అమావాస్య ఆదివారం ప్రారంభము). |
| 1-6-2001 | జ్యేష్ఠ శుద్ధ దశమీ శుక్రవారం గురుమౌఢ్య ప్రారంభము. |
| 27-6-2001 | ఆషాఢ శుద్ధ సప్తమీ బుధవారం గురుమౌఢ్య త్యాగమగును. |
| 8-12-2001 | కార్తీక బహుళ అష్టమీ శనివారం శుక్రమౌఢ్య ప్రారంభము. |
| 20-2-2002 | మాఘ శుద్ధ అష్టమీ బుధవారం శుక్రమౌఢ్య త్యాగమగును. |

## పుష్కర నిర్ణయము

16-6-2001 జ్యేష్ఠ బహుళ దశమీ శనివారం ఉదయం శ్రీ సరస్వతీ నదికి పుష్కర ప్రారంభము.

## పశుపాలకాది ఫలమ్

అస్మిన్నబ్దే శ్రీ కృష్ణః పశుపాలకః, గోష్ఠాగార ప్రాపకత్వ, గోష్ఠాద్బహిష్కర్తృత్వేపి శ్రీ కృష్ణస్యైవ॥

శ్లో॥ పశువృద్ధిస్సుభిక్షం చ బహుసస్యార్ఘసంపదః।

సంపూర్ణతృణవృద్ధిశ్చ శ్రీ కృష్ణే పశునాయకే॥

తా॥ పశుపాలకాద్యాధిపత్యములు 3ను శ్రీ కృష్ణునికేయగుటచే పశువృద్ధి, పశువులకు తృణ, క్షీరాద్యభివృద్ధి, సస్యవృద్ధి, సుభిక్షము కల్గును.

## భూవాహకశేషాదుల ఫలమ్

శంఖకాఖ్యే భూమివహే సుఖం వహతి భూతలే। ప్రవాహ నామకోవాయుః మధ్యమవృష్టికృత్। తటిత్ నామకో విద్యుదీ సువృష్టి కరంభవేత్, నిర్ఘోషనామక గర్జితముచే అల్పవృష్టి, క్షీర నామక సముద్రముచే వాయు పీడలున్ననూ సుభిక్షమగును. చతుర్మేఘ పక్షమున పుష్కరనామక మేఘము అల్పవృష్టి కల్గించును.

## వర్షాఢక స్థితి నిర్ణయము

ఉగాది నుండి మే 22 వరకు బాల్యవేశ్య హస్తగతమై వర్ష కుంచముండును. ఈ సమయమున ధాన్యాదులు, కొబ్బరి, మిర్చి ధరలు తగ్గును. మే 22 నుండి ఆగష్టు 23 వరకూ యవ్వన వేశ్యచేతి యందు వర్ష కుంచముండును. ఈ సమయమున కొంతవరకు ధరలు తగ్గును. స్వల్ప వర్షయోగములుండును. ఆగష్టు 23 నుండి సంవత్సరాంతము వరకు శనివక్రత్వము కల్గుటచే వృద్ధ వేశ్య చేతియందు వర్ష కుంచముండుటచే సస్యానుకూల వర్షములు. వ్యాపారులకు మాత్ర మనుకూలమగు ధరలు వుండును. 3 కుంచముల వర్షము. (ఆఢక ప్రమాణము - నూరు యోజనముల విస్తీర్ణం, 200 యోజనముల ఎత్తు దేవమానముగ చెప్పబడినది). అందు 8 భాగములు సముద్రములందును. 9 భాగములు పర్వతములందును, 3 భాగములు భూమియందును వర్షించును.

### చంద్రగ్రహణము

5-7-2001 తేదీ శ్రీ వృషనామ సంవత్సర ఆషాఢ శుక్లపూర్ణిమా గురువారం రాత్రియందు పూర్వాషాఢ నక్షత్రము ధనూరాశియందు కల్గును. కేతుగ్రస్తం, సవ్య గ్రహణం, అర్ధగ్రాసము కల్గివుండును. ప్రాగాగ్నేయమధ్యేస్పర్శ. నైఋతి పశ్చిమదిశి మోక్షః.

| | | |
|---|---|---|
| స్పర్శ కాలము | రా.గం. | 7-05 |
| మధ్యకాలము | రా.గం. | 8-25 |
| మోక్షకాలము | రా.గం. | 9-44 |
| గ్రహణం ఆద్యంత పుణ్యకాలము | గం. | 2-39 నిమిషములు |



ఈ గ్రహణము రాత్రి ప్రథమ యామమునందు సంభవించుటచే పగలు గం. 12-00 లోపున నిత్యభోజన ప్రత్యాబ్ది కాదులాచరించవలెను. ఈ గ్రహణము పూర్వాషాఢా నక్షత్రము, ధనూరాశియందు సంభవించుటవలన వీరలీ గ్రహణమును చూడరాదు. యధాప్రకారం శాంతి జరిపించుకోవలెను.

గ్రహణానంతరము మరుదినం ఉదయం పూర్వాషాఢ వారలు, ధనూరాశివారలు, గ్రహణదోష నివారణార్థం బంగారు బింబమును (రూపు) గాని వెండి రూపునుగాని, బియ్యము, వస్త్రము, దక్షిణాదులు, యధాశక్తి దానము చేసినయెడల శాంతి కలుగునని చెప్పబడినది.

## రాజాది నవనాయక ఫలములు

**1.** రాజా చంద్రః

శ్లో॥ గోధూమ శాలీక్షుమతీ ధరిత్రీ సస్యాంబుపూర్ణాధ్వరవేదనాదితా।
విభాంతి గావః సుదుఘాః ప్రభూతాస్సంవత్సరస్యాధిపతౌ శశాంకే॥

ఈ సంవత్సరము రాజా చంద్రుడు అగుటవలన పాడిపంటలు, సస్యములు అభివృద్ధి చెందును. అందరి యందు కోరికలు అధికముగ వుండును. స్త్రీ సంఘము లెక్కువగును. ఆహార పదార్థముల కొరత వున్ననూ అధిక ధరలయిననూ ప్రజలు భరింతురు.

**2.** మంత్రీ శుక్రః

శ్లో॥ స్త్రీ సంయోగే సదాప్రీతిః ఫలితా ధాన్యజాతయః।
భవంతి గావః సుదుఘాః సువృష్టిర్భృగు మంత్రితః॥

మంత్రి శుక్రుడగుట వలన బంగారాది లోహముల ధర నిలబాటు, పురుషులు స్త్రీలోలురై వుందురు. భోగలాలసత్వమధికము, సస్యానుకూల వర్షములువుండును.

**3.** సేనాధిపతి శ్శుక్రః

శ్లో॥ సువృష్టి రత్యంత సమృద్ధసస్యం సుభిక్షమర్ఘ్యో బహుళోధరిత్ర్యాం।

నరాః స్త్రీయాకామరతాః ప్రమత్తాః సేనాధిపత్యే ఖలుభార్గవస్య॥

సేనాధిపతి శుక్రుడగుటచే సస్య సమృద్ధి, సుభిక్షత కల్గివుండును. స్త్రీ పురుషులు పరస్పర ఆకర్షణలు కల్గి వుందురు. కోర్టువ్యవహారములు అధికమగును.

**4.** సస్యాధిపతిశ్చంద్రః

శ్లో॥ జలధాన్యాని సర్వాణి స్థలధాన్యాని యానిచ।

వృక్షజాతి స్సుఫలితా చంద్రే సస్యాధిపేసతి॥

పూర్వసస్యములు, జల ధాన్యములు, మాగాణీ, మెట్టభూములు బాగుగా ఫలించును. ధరలు సమముగ వుండును.

**5.** ధాన్యాధిపతిః రవిః

శ్లో॥ మధ్యవృష్టిః ఫలం స్వల్ప మనర్ఘశ్చ మహద్భయం।

రక్తసస్యానిజాయంతే సూర్యేధాన్యాధిపే సతి॥

ధరలు గురించి రాజకీయనడిదుడుకులు అధికముగా వుండును. దళారులవల్ల, రాజకీయము వలన ధరలు గురించి సమ్మెలు పెరుగును. కొబ్బరి, మామిడి, మిర్చి, కందులు బాగుగ ఫలించును.

**6.** అర్ఘాధిపతి శ్శుక్రః

శ్లో ॥ అర్ఘాధి పోయధాశుక్రః సర్వధాన్యార్ఘః వృష్టయః।

శ్వేతధాన్యం సుఫలితం సుభిక్ష స్యాచ్చ భూతలే॥

శుక్రుడు అర్ఘాధిపతి అగుటచే తెలుపు ధాన్యములు విరివిగ ఫలించును. వీనికి ధరలు మందము, ఫ్యాన్సీ, అలంకార వస్తువులు, పట్టు, రాగి,ధరలు కొద్దిగ పెరిగి అందుబాటులో వుండును.

**7.** మేఘాధిపతి శ్శుక్రః

శ్లో॥ అతివృష్టి స్సుభిక్షంచ సస్యవృద్ధిర్నిరామయాః।

క్షీరప్రదాస్సదాగావః శుక్రేమేఘాధిపేసతి॥

శుక్రుడు మేఘాధిపతి అగుటచే ధరలందు అతివృష్టి, హెచ్చుతగ్గులు, సస్యరోగ నివారణా చర్యలు అధికమగును.

**8.** రసాధిపతిర్బుధః

శ్లో॥ శశితనయే రసనాథే పిప్పలీ శుంఠీచ హింగులశునాని।

ఘృత తైలాద్యపినిఖిలం దుర్లభమిక్షూద్భవం సకలం॥

రసాధిపతి బుధుడు కావున పిప్పళ్ళు, శొంఠి, అల్లము, మిరియాలు, ఇంగువ, ఉల్లి, నెయ్యి, నూనెలకు, చెరకు, బెల్లం, వేరుశనగ, ఆముదాలు మొదలగువానికి ధర హెచ్చును.

**9.** నీరసాధిపతిశ్చంద్రః

శ్లో॥ ముక్తాఫలం రత్న సువర్ణరౌప్య కాంస్యాది వస్త్రాభరణాని శశ్వత్।

వృద్ధాంగతాన్యాసు భవంతి లోకే చంద్రోయదానీరస నాయకస్స్యాత్ ॥

నీరసాధిపతి చంద్రుడగుటచే రత్నములు, ముత్యములు, బంగారాది లోహములు, వస్త్రములు, అలంకార వస్తువులు ఉత్పత్తి అధిక మగుటచే ధరలు తగ్గి అందుబాటులో వుండును.

* * *

# శ్రీ వృషనామ సంవత్సరములో గ్రహసంచారములు

## రవిచారః

చైత్ర బ.5 శుక్రవాసరే మేషే రవిః; వైశాఖ బహుళ 7 సోమ వృషభే; జ్యేష్ఠ బ.9 శుక్ర మిథునే; ఆషాఢ బహుళ 10 సోమ కర్కాటకే; శ్రావణ బహుళ 13 శుక్ర సింహే; భాద్రపద బహుళ 30స్యా సోమ కన్యాయాం; నిజాశ్వయుజ శు.1 బుధ తులాయాం, కార్తీక శు.1 శుక్ర వృశ్చికే; మార్గశిర శు.2 ఆది ధనూరాశౌ, పుష్య శు.1 సోమ మకరే; పుష్య బ.30స్యా మంగళ కుంభే, మాఘ బ. 30స్యా గురు మీనే రవిప్రవేశః.

## కుజచారః

చైత్ర బ.2 మంగళ ధనుషి; వైశాఖ బ.5 శని కుజవక్రారంభః, జ్యేష్ఠ బ.4 ఆది వృశ్చికే వక్రీ; ఆషాఢ బ.30 స్యా శుక్ర కుజవక్రత్యాగః; భాద్రపద శు.8 ఆది ధనుషే ఋజుః; నిజఆశ్వయుజ శు.2 గురు మకరే; కార్తీక శు.15 శుక్ర కుంభే; మార్గశిర బ.12 గురు మీనే; మాఘ శు.9 గురు మేషే స్వక్షేత్రే; ఫాల్గుణ బ.7 గురు వృషభే కుజః.

## బుధచారః

చైత్ర శు.9 సోమ మీనే; బ.10 బుధ మేషే; వైశాఖ శు.11 గురు వృషభే; బ.14 మంగళ మిథునే; జ్యేష్ఠ శు.13 సోమ బుధ వక్రారంభః; బ.13 మంగళ వక్రి వృషభే; ఆషాఢ శు.8 గురు బుధవక్రత్యాగః; బ.1 శుక్ర మిథునే ఋజుః; శ్రావణ శు.7 శుక్ర కర్కా; బ.7 శని సింహే; భాద్రపద శు.10 మంగళ కన్యాయాం; అధికాశ్వయుజ శు.3 గురు తులాయాం 15; మంగళ బుధవక్రారంభః; బ.9 గురు వక్రి కన్యాయాం; నిజ ఆశ్వయుజ శు.7 మంగళ బుధవక్రత్యాగః; బ.2 శని తులాయాం, కార్తీక శు.7 గురు వృశ్చికే; బ.11 మంగళ ధనుషి; మార్గశిర శు.15 ఆది మకరే; పుష్య శు.6 శని వక్రారంభః; బ.12 శనివక్రత్యాగః; మాఘ బ.9 గురు కుంభే; ఫాల్గుణ శు.13 మంగళ మీనే బుధః.

## గురుచారః

వత్సరాది ప్రభృతి జ్యేష్ఠ బ.10 శనివాసరపర్యంతం వృషభ రాశౌ సంచారః, తదాది వత్సరాంతం మిథునరాశౌ సంచారః; నిజఆశ్వయుజ బ.2 శని గురువక్రారంభః; మాఘ బ.3 శని వాసరే గురు వక్రత్యాగః.

## శుక్రచారః

జ్యేష్ఠ శు.8 బుధ మేషే శుక్రః; ఆషాఢ శు.9 శుక్ర వృషభే; శ్రావణ శు.7 శుక్ర మిథునే; భాద్రపద శు.3 మంగళ కర్కాటకే; బ.14 ఆది సింహే; అధికాశ్వయుజ బ.8 బుధవాసరే కన్యాయాం; నిజఆశ్వయుజ బ.2 శని తులాయాం; కార్తీక శు.12 మంగళ వృశ్చికే; మార్గశిర శు.6 శుక్ర ధనుషి; పుష్య శు.1 సోమ మకరే; బ.10 గురు కుంభే; మాఘ బ.5 ఆది మీనే; ఫాల్గుణ శు.14 బుధ మేషే శుక్రః.

## శని సంచారః

ఈ వత్సరమంతయు శని వృషభరాశియందు సంచరించును. అధికాశ్వయుజ శుద్ధ దశమీ గురువారం నుండి పుష్య బహుళ ఏకాదశీ శుక్రవారం వరకు వక్రగమనం కలదు.

## రాహుకేతుచారౌ

వత్సరాది ప్రభృతి మాఘ శు.4 శనివాసర పర్యంతం మిథునే రాహుః, ధనుషి కేతుః సంచారః. తదాది వత్సర పర్యంతం వృషభే రాహుః వృశ్చికే కేతుః సంచారః.

* * *

## కందాయ ఫలములు

| అశ్విని | భరణి | కృత్తిక | రోహిణి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లేష | మఘ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 |
| 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 |

| స్వాతి | విశాఖ | అనూ | జ్యేష్ఠ | మూల | పూ.షా | ఉ.షా | శ్రవ | ధనిష్ఠ | శత | పూ.భా | ఉ.భా | రేవ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 |
| 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 |

*ఇందలి బేసి సంఖ్యలు ధనలాభమును, సమసంఖ్యలు సమఫలమును, శూన్యసంఖ్యలు శూన్య ఫలితములను ఇచ్చును. మొదటి సున్న రోగభయము, మధ్యసున్న మనోభీతిని, చివరిసున్న హానిని తెలుపును. ఒక్కొక్క సంఖ్య 4 మాసములుండును.*

| ఆదాయవ్యయములు - రాజపూజ్యావమానములు | | | | |
|---|---|---|---|---|
| రాశి | ఆదాయం | వ్యయం | రాజపూజ్యం | అవమానం |
| మేషం | 14 | 2 | 4 | 5 |
| వృషభం | 8 | 11 | 7 | 5 |
| మిధునం | 11 | 8 | 3 | 1 |
| కర్కాటకం | 5 | 8 | 6 | 1 |
| సింహం | 8 | 2 | 2 | 4 |
| కన్య | 11 | 8 | 5 | 4 |
| తుల | 8 | 11 | 1 | 7 |
| వృశ్చికం | 14 | 2 | 4 | 7 |
| ధనుస్సు | 2 | 11 | 7 | 7 |
| మకరం | 5 | 5 | 3 | 3 |
| కుంభం | 5 | 5 | 6 | 3 |
| మీనం | 2 | 11 | 2 | 6 |
| సర్వాదాయం 93 –సర్వవ్యయం 84 = 9 మిగులు | | | | |

| సంవత్సర ఫలితము | | | | |
|---|---|---|---|---|
| అశ్విని | పుష్యమి | స్వాతి | అభిజిత్ | వారికి మనస్తాపము |
| భరణి | ఆశ్లేష | విశాఖ | శ్రవణం | వారికి రాజపూజ్యత |
| కృత్తిక | మఖ | అనూరాధ | ధనిష్ఠ | వారికి యుద్ధభయం |
| రోహిణి | పుబ్బ | జ్యేష్ఠ | శతభిషం | వారికి అలంకారప్రా[illegible] |
| మృగశిర | ఉత్తర | మూల | పూ.భా. | వారికి రోగభయము |
| ఆర్ద్ర | హస్త | పూ.షా. | ఉ.భా. | వారికి ఆయుర్వృద్ధి |
| పునర్వసు | చిత్త | ఉ.షా. | రేవతి | వారికి అర్థలాభము |

## వర్షధాన్య ప్రమాణములు

వర్షం 7, ధాన్యం 7, శీతం 9, తృణం 17, ఉష్ణం 5, మారుతం 17, ప్రజావృద్ధి 9, నాశ 11, రాజవిద్వరం 5, పుణ్యం 5, పాపం [illegible] వ్యాధి 9, ఉపశ 5, ఆచారం 7, అనాచారం 3, జన్మలు 15, మరణాలు 13, దేశోప 17, దేశస్వా 13, చోరభ 3, శాంతి 7, అగ్నిభయం 1[illegible] శాంతి 17, మృగోపద్ర 9, మృగక్షయం 5, కీటక భయం 7, తన్నాశ 17, మూషికవృ 19, తన్నాశ 13, కామం 17, క్రోధం 15, లోభం 1[illegible] మోహం 11, మదం 7, మాత్సర్యం 17, సుఖం 7, దుఃఖం 11, భోగం 13, విడంబం 13, మనోవేదన 11, ద్వేషం 7, ప్రతిష్ఠ 13, అప్రతి[illegible] 13, ద్యూతం 3, మత్తత 9, పురుష ఉత్పత్తి 15, స్త్రీ ఉత్పత్తి 3, ధాతు వృద్ధి 7, భయం 11, శౌర్యం 15, దుష్టశి 19, శిష్ట ప్రతి5, సత్యం [illegible] అసత్యం 9, విశ్వాసం 11, అవిశ్వా 13, దయ 15, నిర్దయ17, న్యాయం 19, అన్యాయం 3, జ్ఞానం 7, అజ్ఞానం 17, కపటం 1[illegible] నిష్కపటం 17, ధార్మికం 9, అధార్మికం 17, సస్యవృద్ధి 5, నాశ 7, పశువృద్ధి 8, నాశ 8, శుకవృద్ధి 5, నాశ 7, ధూమ్రకీటక వృద్ధి 8, న[illegible] 8, పక్షివృద్ధి 3, నాశ 2, ధేనువృద్ధి 4, నాశ 3, మహిషవృద్ధి 3, తన్నాశ 5, మృగవృ 2, నాశ 4, ఛాగవృద్ధి 5, నాశ 3, వైశ్యవృద్ధి 3, నాశ [illegible] శూద్ర వృద్ధి 3, నాశ 1, మ్లేచ్ఛవృ 4, నాశ 4, సంకరవృ 1, నాశ 4, నవరత్నవృద్ధి 3, నాశ 4, అశ్వవృద్ధి 4, నాశ 3, గజవృద్ధి 1, నాశ [illegible] ఉష్ట్రవృద్ధి 5, నాశ 4, విప్రవృద్ధి 5, నాశ 1, క్షత్రియవృద్ధి 2, నాశ 1, రత్నాదులు 1, సమఫలం, అతివృష్టి 5, అనావృష్టి 7, మూషికవృద్ధి [illegible] శలభవృద్ధి 11, శుకవృద్ధి 9, స్వచక్రభయం 17, పరచక్ర భయం 9, క్షుధా 13, తృష్ణ 7, నిద్ర 5, ఆలస్యం 9, ఉద్యోగం 9, శాంతం [illegible] క్రోధం 11, డంబం 3, మిత్రభేదం 1, ఇష్టత 13, రసనిష్పత్తి 7, ఫలనిష్పత్తి 11, ఉత్సాహం 9.

## 2001-2002 శ్రీ వృషనామ సంవత్సర కార్తెలు - వృష్టి నిర్ణయములు

| సం: | కార్తెలు | తేదీలు | వారం | సమయం | నక్షత్రం | లగ్నం | ఫలితములు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | భరణి | 27-4-2001 | శుక్ర | సా.గం. 4-37 | మృగ. 3 | కన్య | వాయువు, అధికతాపము, అధికవేడిమి. |
| 2. | కృత్తిక | 11-5-2001 | శుక్ర | ప.గం. 11-33 | మూల | కర్కా | ఉష్ణము, వాయు ప్రాబల్యము. |
| 3. | రోహిణి | 25-5-2001 | శుక్ర | ఉ.గం.8-57 | మృగ 4 | మిథునం | ఉష్ణాధిఖ్యత, వాయుస్తంభన, ఖండప్రాంతము. |
| 4. | మృగశిర | 8-6-2001 | శుక్ర | ఉ.గం. 8-31 | పూ.షా. | కర్కా | సమోష్ణము, తేమ, వాయుతాపము, ఖండప్రాంత తుషారములు |
| 5. | ఆర్ద్ర | 22-6-2001 | శుక్ర | ఉ.గం.9-24 | ఆర్ద్ర | కర్కా | వర్షపాతాధిక్యత, గాలి దుమారములు, సువృష్టి. |
| 6. | పునర్వసు | 6-7-2001 | శుక్ర | ఉ.గం.11-8 | ఉ.షా.1 | కన్య | ఆతపము, గ్రీష్మాధిక్యత, ఖండప్రాంత స్వల్పవర్షం. |
| 7. | పుష్యమి | 20-7-2001 | శుక్ర | ప.గం.12-45 | పున 3 | తుల | నిర్జలం, దాహకం, ఉష్ణాధిక్యత. |
| 8. | ఆశ్లేష | 3-8-2001 | శుక్ర | ప.గం.1-02 | ఉ.షా 3 | తుల | తుషారం, ఖండప్రాంత విచిత్ర వర్షములు. |
| 9. | మఖ | 17-8-2001 | శుక్ర | ప.గం.11-47 | పుష్య | తుల | సువృష్టి, కొండప్రాంతపు వర్షములు-మిశ్రమవాతావరణము. |
| 10. | పుబ్బ | 31-8-2001 | శుక్ర | ప.గం.3-46 | శ్రవణ | మకరం | జలవర్ష సమృద్ధి, వరదలు – వర్షాధిక్యత |
| 11. | ఉత్తర | 13-9-2001 | గురు | రా.గం.2-05 | పుష్య | కుంభం | సస్యోచిత వృష్టి, అర్ధజలం – అతివృష్టి |
| 12. | హస్త | 27-9-2001 | గురు | సా.గం.5-07 | శ్రవణ | కర్కా | సస్యోచిత ఖండప్రాంత వర్షములు. |
| 13. | చిత్త | 10-10-2001 | గురు | తె.గం.5-26 | పుష్య 1 | కన్యా | అనావృష్టి వర్షములు, హిమము. |
| 14. | స్వాతి | 24-10-2001 | బుధ | ప.గం.3-8 | ఉ.షా.4 | కుంభం | సస్యోచితం, మంచు. |
| 15. | విశాఖ | 6-11-2001 | మంగ | రా.గం.10-09 | పున 3 | మిథునం | సస్యోచితం, ఉష్ణ, మిశ్రమ వాతావరణం. |
| 16. | అనూరాధ | 19-11-2001 | సోమ | తె.గం.3-09 | ఉ.షా.1 | కన్య | స్వల్పవృష్టి, వాయువు – శీతలం, అనావృష్టి. |
| 17. | జ్యేష్ఠ | 2-12-2001 | ఆది | తె.గం.4-24 | ఆర్ద్ర | తుల | నిర్జలం, ఉష్ణాధిఖ్యతం. |

## శ్రీ వృషనామ సంవత్సర వ్రతదిన పట్టి

| 2001-2002 | శుక్లపక్షము | | | | కృష్ణపక్షము | | | | నక్షత్రములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మాసములు | ప్రతిపత్ | షష్ఠి | ఏకాదశి | ○ పూర్ణిమ | ప్రతిపత్ | ఏకాదశి | మాసశివ రాత్రి | ● అమావాస్య | కృత్తిక | రోహిణి | ఆర్ద్ర | పున ర్వసు | శ్రవణం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| మార్చి 2001 | 26 | 30 | - | - | - | - | - | - | 29 | 30 | - | - | - |
| ఏప్రిల్ | 24 | 29 | 4 | 8 | 9 | 19 | 22 | 23 | 25 | 26 | 1,28 | 2,29 | 17 |
| మే | 24 | 28 | 3 | 7 | 8 | 19 | 21 | 22 | 23 | 24 | 26 | 27 | 14 |
| జూన్ | 22 | 26 | 2 | 5 | 6 | 17 | 20 | 21 | 19 | 20 | 22 | 23 | 10 |
| జూలై | 21 | 26 | 31 | 5 | 6 | 17 | 19 | 20 | 16 | 17 | 19 | 20 | 8 |
| ఆగష్టు | 20 | 24 | 29 | 4 | 5 | 15 | 17 | 18 | 13 | 14 | 16 | 17 | 4,31 |
| సెప్టెంబరు | 18 | 22 | 28 | 2 | 3 | 13 | 16 | 17 | 9 | 10 | 12 | 13 | 28 |
| అక్టోబరు | 17 | 22 | 27 | 2 | 3 | 13 | 15 | 16 | 6 | 7 | 9 | 10 | 25 |
| నవంబరు | 16 | 21 | 26 | 1,30 | 2 | 11 | 13 | 15 | 3,30 | 4 | 6 | 7 | 21 |
| డిశెంబరు | 15 | 20 | 26 | 30 | 1,31 | 9 | 11 | 14 | 27 | 1,28 | 3,30 | 4,31 | 18 |
| జనవరి 2002 | 14 | 19 | 25 | 28 | 29 | 9 | 13 | 13 | 24 | 25 | 27 | 28 | 15 |
| ఫిబ్రవరి | 13 | 18 | 23 | 27 | 28 | 8 | 10 | 12 | 20 | 21 | 23 | 24 | 11 |
| మార్చి | 15 | 20 | 25 | 28 | 29 | 9 | 12 | 13 | 19 | 20 | 22 | 23 | 10 |
| ఏప్రిల్ | - | - | - | - | - | 8 | 11 | 12 | - | - | - | - | 7 |

## మకర సంక్రమణ పురుష లక్షణము



ది. 14-1-2002 శ్రీ వృషనామ సంవత్సర పుష్య శుక్ల పాడ్యమీ సోమవారం ఉదయాది ఘ.౨౧-౪౭వి.కు. శ్రవణ నక్షత్రం వజ్రం యోగం, బవకరణము పగలు గం|| 3-28 నిమిషములకు వృషభలగ్నమునందు రవి మకరరాశియందు ప్రవేశించి సంచరించును.

'ధ్వాంత' నామ ధేయము – వైశ్యులకు భయము, చందన స్నానం – సుభిక్షము, శ్వేతాంబర వస్త్రధారణం – ఆరోగ్యప్రదము, కస్తూరికాగంధలేపనము వలన పుణ్యస్త్రీలకు దోషము, పున్నాగ పుష్ప ధారణము – యశోహాని, మాణిక్యాభరణధారణ – మణిరత్నములకరిష్టము, సువర్ణ పాత్రయందు భోజనము వలన దుర్భిక్షము, అన్నం భుజించుటవలన దుర్భిక్షమును, నారికేళ ఫలము ఇష్టతచే కొబ్బరికి అధికధర, భిశుండి ఆయుధధారణము, శ్వేతఛత్ర ధారణమువలన ఆరోగ్యకరము, సింహవాహనారూఢుడుగాన మహాభయకరము, కించిస్మితము – అశుభం, తూర్పు దిశా ప్రయాణము, కూర్చొని వుండుటచే తూర్పు ప్రాంతారిష్టము మొదలగు లక్షణములుండును.

శుక్లపక్షమందగుటవలన దుర్భిక్ష క్షామములు, శుద్ధపాడ్యమి శుభప్రదము, సోమవారమగుట శుభకరము, ద్వాదశ ముహూర్తము సుభిక్షమును కలుగచేయునని గ్రంథాంతరము.

### ఫలశ్రుతి

సంక్రాంతి పురుషోత్పత్తి కాలేదానం స్వశక్తితః,
ఫలం కాంస్యాది దానాని దీయతే దోషనాశనం
ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాంశు కాద్యం సతి లేక్షుగావః
ధాన్యం ఖరాంశోర్మకరప్రవేశ ఏతాని దానాని విశేషితాని,
మకరస్తేతీక్ష్ణ భావేధాన్యం దానం కరోతియః
తేజసే రూప సామర్థ్యః సార్వభౌమ ప్రజాయతే
యశ్శృణోతి మధుశుక్లపక్షకే వర్షనాథ సచివాధికం ఫలం,
ప్రాప్నుయాద్దురితముక్త విగ్రహశ్చాయురర్థమతులం యశశ్శుభం.

* * *

# వర్ష యోగములు

**చైత్రమాసము:** ఇందు రవికి సౌమ్య, దహన నాడులందును, కుజ గురు శనులకు వాయు, దహన, మహావాయు నాడులందును సంచారము కలదు. బ. పాడ్యమి ప్రాగస్తమితో బుధుడు, శుక్రో వక్రీ బుజార్భుధుడు, శుద్ధమున వృశ్చికాంగారకుడు కలవు. శుద్ధమున శని కుజ గురు సమసప్తకము కలవు. మాసమంతయు వాతావరణము సమముగా ఉండును. తూర్పు ప్రాంతమున ఆకస్మిక వర్షములు పడును. చాంద్రయోగముచే మార్చి 29.30, ఏప్రిల్ 7,8,9,16,22,23 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు.

**వైశాఖమాసము:** ఇందు రవి గురు శనులకు వాయు, మహావాయు నాడులందును, కుజ గురులకు దహన నాడియందును సంచారము కలదు. బ.పంచమీ కుజవక్రం ప్రా॥ పూర్ణిమ శని అస్తమయం కలవు. మాసమంతయు శని గురులకు ఏకరాశి స్థితి, కుజ గురు షష్టాష్టకము కలవు. కుజయుత కాలసర్పయోగము కలవు. అత్యుష్ణము, వాయుతాపము, వాయుస్తంభన కలిగి ఉండును. బ॥ 30స్యా ప్రాంతమున ఉత్తరాదిన ప్రచండ వాయువులు ఉండును. చాంద్రయోగముచే ఏప్రిల్ 25,26, మే 1,2,13,14,17,18 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు.

**జ్యేష్ఠమాసము:** ఇందు రవి కుజ గురులకు వాయు, దహనవాయు నాడులందు సంచారము కలదు. మాసమంతయు చతుర్గ్రహ కూటములు. పురోబుధ రవి మధ్యమము, శని గురుల ఏకరాశి స్థితి కలవు. శుద్ధత్రయోదశీ బుధవక్రారంభము, బుధోవక్రీ బుజాశుక్రుడు, శుద్ధ దశమీ గురుమౌఢ్యారంభము. బ॥ చవితి వృశ్చిక రాశియందు కుజవక్రము మరియు కుజ శని గురు సమసప్తకము. బ॥ షష్ఠి శన్యోదయము కలవు. శుద్ధమున ఉష్ణాధిక్యము, గ్రీష్మతాపము కల్గును. బహుళమున పొడివాతావరణము కల్గును. చాంద్రయోగముచే పూర్ణిమాప్రాంతమున తొలకరి వర్ష సూచన మాత్రం కల్గును. అమా ప్రాంతమున అక్కడక్కడ స్వల్ప వర్షములు కురియును.

**ఆషాఢమాసము:** ఇందు రవికి సౌమ్య, రస, జల నాడి యందును, కుజశనులకు వాయునాడియందును సంచారము కలదు. శుద్ధ సప్తమీ గురుమౌఢ్యత్యాగము, బుధోదయము, అమావాస్య కుజవక్రత్యాగము కలవు. శుద్ధ అష్టమీ వరకు బుధోవక్రీ బుజార్గురుః, కృత్తికాది శుక్రుడు. బ॥ దశమీ మిధున గురు సంక్రమణము కలవు. పూర్ణిమా ప్రాంతమున అక్కడక్కడ భారీ వర్షములు పడును. చాంద్రయోగముచే జూన్ 22,23,24, జూలై 2,3,6,7,12,13,17 తేదీలలో ఆకస్మిక వర్ష సూచన కల్గును.

**శ్రావణమాసము:** ఇందు గ్రహములన్నింటికీ జల, అమృత, సౌమ్య నాడులందు సంచారము కలదు. శుద్ధ విదియా బుధాస్తమయము. మాసమంతయు వృశ్చికాంగారకుడు. శని కుజ సమసప్తకము, గురుచండాలయోగము. పూర్ణిమా ప్రాంతమున ఖండప్రాంతవాయు మిశ్రత కల్గును. మొత్తం మీద ఈ మాసమున వర్షములు తక్కువ. అయిననూ పూర్ణిమా ప్రాంతమున వరదలు, అత్యంత జలప్రవాహములు కల్గి ప్రాకృతిక భీభత్సములు కల్గును. చాంద్రయోగముచే జూలై 26,27,30, ఆగష్టు 2,3,4,6.7.15.16, తేదీలలో వర్షములు కురియును.

**భాద్రపదమాసము:** ఇందు రవి గురులకు అమృత జల రస, సౌమ్య నాడులందును, కుజ శనులకు దహన, వాయు నాడులందును సంచారము కలదు. శుద్ధ విదియా బుధోదయము, సింహ రవి, ఆర్ద్ర గురుచండాలయోగము కలవు. దశమి నుండి పురోబుధ రవిమధ్యమము. బ॥ చతుర్దశి పశ్చిమదిశి మఘాది శుక్రుడు శుద్ధ 8 వరకూ శని కుజ సమసప్తకము కలవు. శుద్ధ అష్టమి నుండి కుజ గురు సమసప్తకము కలవు. మాసమంతయు చాంద్రయోగముచే సస్యానుకూల వర్షములు. చాలాప్రదేశములందు వరదలు సంభవించును. ఆగష్టు 22,23,27,30,31, సెప్టెంబరు 1,2,5,6,10,12,16,17 తేదీలలో వర్షయోగము కలదు.

**ఆశ్వయుజమాసము:** ఇందు రవి కుజులకు రస, సౌమ్య, దహన నాడి, శని గురులకు వాయు, మహావాయు నాడులందును సంచారము కలదు. అధిక శుద్ధ పూర్ణిమా ప్రాంతమున బుధవక్రారంభము. మాసమంతయు శని వక్రము నిజ శుద్ధ షష్ఠి ప్రాగుదిత బుధుడు. మాసమంతయు పశ్చిమదిశి మఘాది పంచక శుక్రుడు నిజశుద్ధ విదియా మకరాంగారకుడు. శుద్ధ సప్తమీ బుధ వక్రత్యాగము. బ॥ విదియా గురు వక్రారంభము. బ॥ అష్టమీ స్వాతీ త్రయశుక్రుడు కలవు. మాసమంతయు అన్ని ప్రాంతములందు వర్షము కురియును.

**కార్తీకమాసము:** ఇందు రవి శనులకు వాయు మహావాయు నాడులందును, కుజ గురులకు అమృత జలసౌమ్యనాడులందును సంచారము కలదు. మాసమంతయు పశ్చిమదిశి స్వాతీత్రయ బుధశుక్రులు. పూర్ణిమా అంగారకచలనము. బ॥ అష్టమీ శుక్రాస్తగతము.

మాసమంతయు గురు వక్రము కలదు. చాంద్రయోగముచే వాయు ప్రాబల్యము అధికముగా ఉండును. నవంబరు 16,17,20,21,22,25,26,27, డిశెంబరు 2,3 తేదీలందు వర్ష సూచనలుండును.

మార్గశిరమాసము: ఇందు గ్రహములన్నింటికీ సౌమ్య, రస జల నాడీ సంచారం కలదు. మాసమంతయు శని గురుల వక్రము. బ॥ ద్వాదశి అంగారక చలనము కలవు. వాతావరణము మంచు ప్రాధాన్యత కల్గి ఉండును. మిశ్రమవాయువులు వీచును. చాంద్రయోగముచే డిశెంబరు 16,17,22,23,30,31, జనవరి 4 తేదీలలో ఆకస్మిక వర్షసూచనలుండును.

పుష్యమాసము: ఇందు గ్రహములన్నింటికీ రస, జల, అమృత, సౌమ్య నాడులందును శనికి వాయు నాడియందును సంచారము కలదు. శుద్ధ షష్ఠి బుధవక్రారంభము. బ॥ దశమీ బుధోవక్రీ బుజు శ్శుక్రః. శని గురు వక్రం కలవు. మాసమంతయు మంచు దట్టముగా, శీతల వాయువులు అధికముగా నుండును. శుద్ధమున చాతుర్గ్రహకూటమి ప్రభావముచే ఉత్తరాది ప్రాంతమున తుఫానులు ఉండగలవు. చాంద్రయోగముచే జనవరి 14,15,18,25,26, ఫిబ్రవరి 3,4,5,9,10 తేదీలందు వర్ష సూచనలు.

మాఘమాసము: ఇందు రవి గురులకు అమృత, రస, జల, సౌమ్య నాడులందును, కుజ శనులకు వాయు, దహన, మహావాయు నాడులందును సంచారము కలదు. శుద్ధ నవమీ వరకూ పురో అంగారక రవి మధ్యమము కలవు. శు. అష్టమీ శుక్రోదయము. బ॥ చవితి గురు వక్రత్యాగము. శు॥ చవితి రాహు కేతు చలనము కలవు. బ॥ పంచమీ నుండి నవమి వరకూ పురశ్శుక్ర రవి మధ్యమము కలవు. చాంద్రయోగముచే ఫిబ్రవరి 13,14,23,24,25, మార్చి 6,7,10 తేదీలందు ఆకస్మిక వర్షములుండును.

ఫాల్గుణమాసము: ఇందు గ్రహములన్నింటికీ సౌమ్య, మహావాయు నాడులందు సంచారము కలదు. మాసమంతయు మేషాంగారకుడు. శు॥ నవమీ బుధాస్తమయము, ఆర్ద్ర గురుడు. బ॥ సప్తమి నుండి శని కుజ రాహువులకు ఏకరాశి స్థితి కల్గి దోషము వట్టినది. బ॥ విదియా కృత్తికాంగారకుడు దోషప్రదుడు. మాసమంతయు దోషముతో కూడిన తూర్పువాయువు, దక్షిణపశ్చిమదిశ వర్షములు, మిగిలిన దిశలందు ఉష్ణప్రాబల్యము కలిగి ఉన్నది. చాంద్రయోగముచే మార్చి 15,16,21,22,28,30,31, ఏప్రిల్ 5,6, తేదీలందు ఆకస్మిక వర్షయోగము కల్గును.

* * *

## సరకుల ధరలు

చైత్రమాసము: ఉగాది నుండి గరుడపచ్చ, కలప, ఉల్లి, మిర్చి, పొట్టుధాన్యములు ధర నిలబాటు. ఏప్రిల్ 9 నుండి ద్రాక్ష, శెనగలు, పాలు, తిలతైలాదులు ధరవృద్ధి. బహుళమున ఆవాలు, మెంతులు, జీలకర్ర, పసుపు, కుంకుళ్ళు, సుగంధ ద్రవ్యాలు, సర్వధాన్యములు ధర కొద్ది హెచ్చి నిలబాటు. ఏప్రిల్ 12 నుండి ఉప్పు, నువ్వులు, ధాన్యము, గృహోపకరణములు, సుగంధ ద్రవ్యములు, ధర అందుబాటు. మాసము మొత్తం మీద కలప, జొన్నలు, ఉలవలు గిరాకీ.

వైశాఖమాసము: మాసమంతయు రస ద్రవ్యములు ధర హెచ్చును. ధాన్యం, నెయ్యి, షేర్లు ధరహెచ్చి నిలబడును. బహుళమున చెఱకు, ప్రత్తి, పట్టు, చర్మములు, ఎరుపు వస్తువులు, దుంపజాతులు, రసాయనికములు, నెయ్యి, మినుములు ధర హెచ్చును. మే 1 నుండి మిర్చి, ధాన్యం, పసుపు, కుంకుళ్ళు, షేర్లు ధర హెచ్చును. మే 12 నుండి గృహోపకరణములు, కందమూలములు, బంగారము, మణులు గిరాకీ.

జ్యేష్ఠమాసము: మాసమంతయు పశువులు, ఉప్పు, క్షారములు, తులాభాండములు హెచ్చును. పసుపు, చింతపండు, వస్త్రములు పూర్ణిమా ప్రాంతమున హెచ్చి తగ్గును. జూన్ 10 నుండి గోధుమలు, ఎరుపు ధాన్యములు, కొబ్బరి, కూరగాయలు, నిత్యావసరములు ధర హెచ్చును. మాసమంతయు, పింగాణి, అల్యూమినియం, సూక్ష్మధాన్యములు, అపరములు, స్వల్పంగా హెచ్చును. జూన్ 15 నుండి సుగంధ ద్రవ్యములు, ఉల్లి, కుంకుళ్ళు, పశువులు, షేర్లు, ప్రత్తి, దారము ధర హెచ్చి నిలబాటు.

ఆషాఢమాసము: మాసమంతయు తెలుపు వస్తువులు, పాలు, పంచదార, ప్రత్తి, దూది వస్త్రములు గిరాకీ, లోహములు, షేర్లు, కొబ్బరి, ముత్యములు, రత్నములు, జలధాన్యములు, చెఱకు, ఉప్పు సమధరలు. కూరలు, జీలకర్ర, పసుపు, మిర్చి, చింతపండు, తైలాదులు ధరతగ్గి నిలబాటు. చతుష్పాదులు, లోహాదులు, కొబ్బరి, బంగారము గిరాకీ. భోజన వస్తువులు, గోధుమలు, పేపరు ధర హెచ్చును.

శ్రావణమాసము: మాసమంతయు గోధుమలు, పెసలు, మినుములు, ఒడ్లు, నువ్వులు, ఉలవలు ఒక్కసారిగా హెచ్చును. ఆగష్టు మొదటివారమున వాతావరణ ప్రతిబంధకములచే నిత్యావసరవస్తువులు, జలచరములు దుర్లభము. పూర్ణిమాప్రాంతమున ముత్యములు, చింతపండు, మిర్చి, కొబ్బరి, పసుపు, సుగంధములు గిరాకీ. ఆగష్టు 17 నుండి వెండి, పట్టు, బంగారము, ముత్యము, శ్రీగంధము, కుశుమములు, సురభి, కషాయవస్తువులు, షేర్లు, సజ్జలు ధర హెచ్చును.

భాద్రపదమాసము: ప్రారంభమున వస్త్రములు, పాలు, బియ్యం, స్వల్పంగా హెచ్చును. ఆగష్టు 26 నుండి పొట్టు ధాన్యములు, రసాయనిక పదార్థములు, శెనగలు, విద్యుత్‌సామాగ్రి, గృహోపకరణములు ధర హెచ్చును. పూర్ణిమా ప్రాంతమున సుగంధ ద్రవ్యములు, కలప, ఏలకులు, వస్త్రములు ధర మందము. బహుళమున, షేర్లు, కంప్యూటర్లు, గోధుమలు, జొన్నలు, ఎరుపు ధాన్యములు, కొబ్బరి, శ్రీగంధము, వాము కొద్దిగా పెరుగును.

అధికఆశ్వయుజమాసము: బంగారము, లోహములు, విలాస వస్తువులు, గంధము, వెండి, వజ్రములు, మత్తుపదార్థములు, షేర్లు, పట్టు, జొన్నలు, కందమూలములు, ఉల్లి గిరాకీ. ధాన్యము, వస్త్రములు, ఆవాలు, ధనియాలు, జీలకర్ర, తిలతైలాదులు ధర తగ్గి నిలబాటు. బహుళమున షేర్లు, ఉల్లి, ఇనుము, గృహోపకరణములు, మత్తుపదార్థములు, చర్మములు, నెయ్యి, కందమూలములు, జీలకర్ర, పసుపు స్వల్పంగా హెచ్చును.

నిజఆశ్వయుజమాసము: శుద్ధమున షేర్లు, గృహోపకరణములు, ఉల్లి, నీలం వస్తువులు, ధాతు వస్తువులు, చర్మములు గిరాకీ. త్రిఫలము, వెల్లుల్లి, ఆవాలు, ఆకులు, చందనము, పాలు హెచ్చును. పసుపు, మిర్చి, చితపండు స్వల్పంగా హెచ్చి నిలబాటు. బహుళమున ధాన్యాదులు, మిర్చి, రస ద్రవ్యములు, పసుపు, కొబ్బరి ధర సమము.

కార్తీకమాసము: మాసమంతయు గృహోపకరణములు, నువ్వులు, నూనెలు, ప్రత్తి, దారము, విద్యుత్ వస్తువులు గిరాకీ. నవంబరు 27,28 తేదీలలో భోజన వస్తువులు, తిలతైలాదులు, నిల్వచేస్తే రెండుమాసములు కలిసివచ్చును. మాసమంతయు షేర్లు, రసాయనిక పదార్థములు, సుగంధద్రవ్యములు, ఔషధములు, ఉల్లి, బెల్లం, చెక్కెర, నెయ్యి, నూనెలు, సమధరలు. బహుళమున బెల్లం, చెక్కెర, కందులు, వక్కలు, గోధుమలు, సుగంధ ద్రవ్యములు, కలప ధర హెచ్చును. పసుపు, బెల్లం ధర తగ్గును.

మార్గశీర్షమాసము: శుద్ధమున గోధుమలు, ఎరుపు ధాన్యములు, మిర్చి, ఉల్లి, ఏలకులు, షేర్లు, పగడములు, ఎరుపు వస్తువులు ధర హెచ్చును. బహుళమున తిలలు, వెండి, ప్రత్తి, శ్రీగంధము, సుగంధ ద్రవ్యములు ధర హెచ్చును. జనవరి 6 నుండి పసుపు, బెల్లం, మిర్చి, నెయ్యి, మత్స్యము, ధాతువస్తువులు, షేర్లు, నిత్యావసర వస్తువులు ధర హెచ్చును.

పుష్యమాసము: మాసమంతయు మినుములు, వస్తువులు, రసద్రవ్యములు, నెయ్యి, నూనెలు ధర హెచ్చును. తెలుపు ధాన్యములు ధర మందము. గోధుమలు, దూది, ప్రత్తి, చెఱకు, పంచదార, కొబ్బరి హెచ్చును. జనవరి మాసాంతమున నిల్వచేసిన ఆహారపదార్థములు వలన నష్టము వచ్చును. బహుళమున రసద్రవ్యములు, లోహములు, బెల్లం, మిర్చి, చింతపండు గిరాకీ. పశువులు, గడ్డి, భోజన వస్తువులు, రసాయనిక వస్తువులు, శెనగలు, రత్నములు, తైలములు ధర హెచ్చును.

మాఘమాసము: శుద్ధమున సర్వధాన్యములు, గృహోపకరణములు, బంగారము, భూములు, మత్తుపదార్థములు, షేర్లు, మత్స్యములు, కోళ్ళు, చర్మము ధర హెచ్చును. ఫిబ్రవరి 20 నుండి స్వయంవృత్తులవారికి గిరాకీ, ధాన్యములు, రంగు వస్త్రములు, గుమ్మడి, కృష్ణధాన్యములు, జీలకర్ర ధరనిలబాటు. బహుళమున సుగంధద్రవ్యములు, ధాన్యము, ఆవాలు, ధనియాలు, మిరియాలు, కొబ్బరి, పేపరు ధరహెచ్చును. పాలు, సాంకేతిక పరికరములు, నూనెలు, చర్మములు ధరనిలబాటు.

ఫాల్గుణమాసము: శుద్ధమున పగడము, బంగారము, తగరము, పచ్చ, ద్రాక్ష, ఉష్ణవస్తువులు, గృహోపకరణములు, ప్రత్తి, చర్మములు ధరహెచ్చును. బహుళమున పాలు, ఉల్లి, శర్కర, ఖండశర్కర, సూక్ష్మధాన్యములు, భోజన వస్తువులు, రాగులు, మిర్చి, షేర్లు గిరాకీ. కొబ్బరి, పసుపు స్వల్పముగా హెచ్చి నిలబాటు.

***

| క్రమ సంఖ్య | ఇంగ్లీషు తేదీలు | మాసః | అశ్విని మఖ | భరణి పుబ్బ పూ.షా. | కృత్తిక ఉత్తర ఉ.షా. | రో ణి హస్త శ్రవ | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు ఖ పూ.భా. | పుష్యమి నూరాధ భా. | ఆశ్లేష జ్యేష్ఠ రేః |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 26 200 | చైత్రం | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని |
| 2 | 200 | వైశాఖం | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు |
| 3 | 24 5-200 | జ్యేష్ఠం | రవి | హువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
|  | 22 6-200 | ఆషాఢం | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |  | గురుడు |
|  | 2 200 | శ్రావణం | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |  | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 6 | 2 8-200 | భాద్రపదం | కేతువు | శని | కుజుడు | బుధుడు | డు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు |
|  | 9 200 | అధికఆశ్వయుజం | రాహువు | తువు | శని | కుజుడు |  |  | చంద్రుడు | శుక్రుడు | రవి |
| 8. | 10-200 | నిజఆశ్వయుజం | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు |
| 9. | 6-11-200 | కార్తీకం | బుధుడు |  | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 0. | 1 | మార్గశిరం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శు | రవి | రాహువు | కేతువు |
| 1. | 4-1-2 | పుష్యం | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | డు | ద్రుడు | శుక్రుడు | రవి |
| 2. | 3-2-2002 | మాఘం |  | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 3. | 2002 | ఫాల్గు |  |  | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు |  | శని | కుజుడు |

## మాసాధిపతుల ఫలితము

**రవి:** పనులతొందర, ఒత్తిడి, ఆలస్యం, తూర్పు ప్రయాణం, దుఃఖం, శిరోవేదన, భయం, రాజభీతి, నిరుత్సాహం, ఆశాభంగం, శ్రమ, కోపం. శాంతికి – రుద్రాభిషేకం, సూర్యస్తుతి.

**బుధ:** బంధు గోష్ఠి, విద్వజ్జన సంగమం, వర్తక జనస్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్యసంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి. శాంతికి – విష్ణుపూజ.

**రాహు:** ఆత్మీత, స్మశానదర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు, బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగలభయం, గుండెజబ్బు, క్షయ, ఉబ్బసము వంటి దీర్ఘరోగబాధ. శాంతికి – దుర్గాపూజ, రాహుస్తుతి.

**గురుడు:** ధనలాభం, గురు ఆదరణం, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతాన సౌఖ్యం, పడమరకు ప్రయాణం, మంచి వస్త్రధారణ, స్థిరవృద్ధి, సర్వశుభం.

**కేతువు:** బంధువైరం, దుష్టస్త్రీ పీడ, మనోచాంచల్యం, దైవభక్తి, అతికోపం, దీర్ఘతర్కం, పుణ్యకర్మలు, స్వల్పాధికారం, కలుగుతుంది. పాము వల్ల ప్రమాదం, తలిమద్రవ్యనష్టం. శాంతికి – మహారుద్రాభిషేకం, కేతుస్తుతి.

**చంద్రుడు:** మాతృసౌఖ్యం, దధ్యన్న సౌఖ్యం, స్త్రీ సంభోగం, సుఖం, మనోనిర్మలత, ఆనందం, గౌరవం, కృషి, వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వప్రయత్న సిద్ధి, స్త్రీ సహాయం, శుభం.

**శని:** నల్లని జంతువుల వలన భయం, నల్లని వస్త్రలాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తా శ్రవణం, నీచకార్యాచరణము, బుద్ధిమాంద్యము, అనవసర ప్రసంగము, విరక్తి, గర్భశూల, గుండెపోటు. శాంతికి – రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.

**శుక్రుడు:** తెల్లని బట్టను ధరించుట, పరిమళ ద్రవ్యోప యోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం, మధురపదార్థలాభం, ధనలాభం, స్త్రీ లాభం, గో లాభం, సర్వం సుఖం.

**కుజుడు:** అధికారుల బెడద, ఆయుధముల వలన భయము, కార్యనాశనం, మనస్తాపం, మనోకాఠిన్యత, దక్షిణ, నైఋతి దిశ ప్రయాణం, ఔషధసేవ, ధనాలోచన, ధనమునకు యిబ్బంది, అకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకం. శాంతికి – శివునకు అభిషేకం, కుజస్తుతి.

# శ్రీ వృషనామ సంవత్సర రాశి ఫలితములు



## మేషరాశి

*అశ్విని : 1,2,3,4 పాదములు, భరణి : 1,2,3,4 పాదములు, కృత్తిక : 1వ పాదము*

| | | | |
|---|---|---|---|
| – | **14** | వ్యయం – | **2** |
| ్యం – | **4** | అవమానం – | **5** |

*ఈ రాశి వారికి గురుడు ఈ సం॥ లో జూన్ 16 వరకు ద్వితీయము నందు రజితమూర్తి, తదాది 3 ట లోహమూర్తి, శని, యీ సంవత్సరమంతా 2ట సువర్ణమూర్తి. రాహువు యీ సంవత్సర కాలములో సంవత్సరాది నుండి ఫిబ్రవరి 16 వరకు తృతీయ మందు, కేతువు భాగ్యరాశి యందు సువర్ణమూర్తులు. తదాది రాహువు 2ట, కేతువు 8ట లోహమూర్తులు.*

గురుడు జూన్ 16 వరకు ద్వితీయ సంచారము వలన కుటుంబ వృద్ధి అధిక ధనాదాయము, ఇంటి యందు శుభ కార్యాచరణ, బంధు మిత్ర సమాగమము, పుణ్యకార్యములందు ఆసక్తి, వ్యవహారములందు సానుకూలత ఏర్పడును. విద్యా విషయాలు ప్రోత్సాహకరముగా వుండును. భూ, గృహ నిర్మాణాదులు కలసి వచ్చును. జూన్ 16 నుండి తృతీయ సంచారము రాహువుతో కలిసి ఉండుట వలన ప్రథమార్థ భాగములో వ్యవహారములందు చిక్కులు, సోదరీ సోదర జన విరోధము, క్షణికావేశము, ధనమునకు ఇబ్బంది కలుగవచ్చును. ఫిబ్రవరి 17 నుంచి పరిస్థితులలో క్రమేణా మార్పులు గోచరించును. మనోబలము పెరుగుట, మనోవాంఛ నెరవేరుట, మనస్సునకు ఆనందము, ధైర్యముతో తీసుకొను ప్రతి నిర్ణయము అనుకూలించును. సోదరుల మధ్య వున్న అభిప్రాయ బేధములన్నీ సమసిపోవును. భాగ్యవృద్ధి కలుగును, ధనాదాయము పెరుగును. శని ఈ సంవత్సరం ద్వితీయమందు సంచరించును. ఏలిన నాటి శనిలో ఇది చివరి భాగములో వున్నది. జూన్ 16 నుండి ఆరోగ్యభంగము కలుగును. ఔషధసేవ అవసరము. శ్రమకు తగిన గుర్తింపు కొంతవరకూ వుండును. ఈ దోష నివారణకు శనీశ్వరునికి, ఈశ్వరునికి అభిషేకము చేయించిన కొంత శుభప్రదముగా వుండును. రాహువు 2002 ఫిబ్రవరి వరకు 3వ స్థానమునందు ధనవృద్ధిపరుడు. వ్యవహార విజయమును, ఆరోగ్యవృద్ధిని నూతన వ్యాపార లాభములు కలిగించును. అయితే సోదర వర్గ అపబలమునిచ్చును. భాగ్యస్థానమందలి కేతు ప్రభావముచే శతృవృద్ధిని, దైవకార్యాచరణ భంగములు కలుగుచుండును.

వ్యవసాయదారులకు మిశ్రమ ఫలితములు వుండును. మొదటి పంటకంటె రెండవ పంట కొంచెము ప్రోత్సాహకరముగా వుండును. అపరాల పంటలు మిక్కిలి లాభదాయకముగా వుండును. వ్యాపారులకు ఉత్తరార్థములో కలిసివచ్చును. సిమెంటు, పెట్రోలు రంగములోని వారికి నూనె, ఇనుము, యంత్ర, లోహ సామగ్రి, కోళ్ళ ఫారమ్, మత్స్య, ధాన్య వ్యాపారులకు ఉత్తరార్థములో లాభములు హెచ్చుగా వుండును. నిలువలు కలిసివచ్చును. రాజకీయ నాయకులకు సమస్యల వేలముగా ఉండును. స్పెక్యులేషన్ యోగించదు.

సంవత్సరాంతమున శని, గురు వక్రములచే, అంగారక దోషముచే కార్య భంగములు, ఆర్థిక ఒడిదుడుకులు ఆరోగ్యము రీత్యా ఔషధసేవలు, నేత్ర అనారోగ్యము, శతృపీడ, అస్థిమిత పరిభ్రమణం, ఆశ ఫలించకపోవుట కలుగుచుండును.

నటగాయకులకు, సినీపరిశ్రమ, షేర్ల, రసాయనిక వ్యాపారులకు మే, ఆగష్టు వరకు యోగించదు. మిగిలిన మాసములు విశేషించును. శ్రమకు తగ్గ గుర్తింపు గౌరవము, లాభములు కలుగును.

విద్యార్థులకు గురుబలము మిశ్రమముగా వుండుటచే విశేషకృషి సల్పినగానీ ఉత్తీర్ణులు కాలేరు.

4, 5 మాసములందు శుభకార్య వాతావరణములు, కార్యదీక్ష, ఆరోగ్యవృద్ధి కలుగును. మనోభీష్టము నెరవేరును. ఉష్ణతత్వ శరీరములవారికి కొంచెము జాగ్రత్త అవసరము. 6, 7 మాసములందు కుజచారముచే శరీర ఆయాసము, శతృవృద్ధి, స్థాన చలనములు, లావాదేవీలు, ఔషధసేవలు కలుగును. 8, 9 మాసములందు సింహ పరాక్రమము, ప్రభుత్వ ఉద్యోగాది విజయములు, సోదరప్రేమ, కోరికలధికమగుట, వ్యవహారములందు శ్రద్ధ కలిగి వుందురు. 10, 11 మాసములందు అస్థిమితము, స్వల్ప అనారోగ్యములు. కార్యదీక్ష, మనోదుఃఖం, రాజ్యలాభము కలుగును. 12, 1 మాసములందు ముందు వ్యవహార విఘ్నములు, తరువాత జయము, విదేశీ నివాస కోరికలు, శ్రమకు తగ్గ గుర్తింపు లేకుండుట, పూర్వ వస్తువ్యయము, చేయు వ్యాపారములందు స్వల్ప లాభము.

మిగిలిన మాసములందు శోషణము, సోదర సోదరీల సమాగమము, వృథా వ్యయము, స్వల్పముగ అశాంతి, తొందరపాటు కలుగుచుండిననూ గురుబలముచే దోషములు నివృత్తి కాగలవు. ఈ మాసములందు దూరదృష్టితో, తక్కువ వ్యయములతో వ్యాపారములు, మాట నిదానము, బంధువులందు మౌనము పాటించుట అత్యుత్తమము, ఖంగారు పడరాదు.

అశ్వినీ నక్షత్రము వారు వైఢూర్యము, భరణీ, కృత్తిక నక్షత్రము వారు కెంపు, ముత్యము ధరించిన సంతుష్టి, అభివృద్ధి, యోగదాయకము.

మొత్తము మీద ఈ రాశివారు శని, గురులకు, ఛాయా గ్రహములకు జపశాంతి చేసిన మేలు కలుగును. శనీశ్వరునికి, ఈశ్వరునికి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వార్లకు అభిషేకములు, లక్ష్మీ, గణేశ్వర పూజలు, నవగ్రహ జపశాంతులు చేసుకొనిన సర్వదా శుభఫలముగా వుండును. శని, గురువార నియమములు విశేష ఫలితములు ఇచ్చును.

*స్త్రీలు మంగళ, గురు వారములు లక్ష్మీ, లలిత, ఆంజనేయ పూజలు చేయుచుండుట అత్యంత యోగదాయకముగా వుండును.*

★★★★

# వృషభరాశి



కృత్తిక : **2, 3, 4** పాదములు, రోహిణి : **1, 2, 3, 4** పాదములు, మృగశిర : **1, 2** పాదములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - | **8** | వ్యయం | **11** |
| రాజపూజ్యం | **7** | అవమానం | **5** |

*ఈ రాశి వారికి గురుడు ఈ సంవత్సరంలో జూన్ **16** వరకు జన్మరాశియందు సువర్ణమూర్తి. తదాది **2**ట సువర్ణమూర్తి, శని, యీ సంవత్సరమంతా జన్మమందు సువర్ణమూర్తి. రాహువు ఫిబ్రవరి **16** వరకు **2**ట, కేతువు **8**ట సువర్ణమూర్తులు, తదాది ఫిబ్రవరి **17** నుండి సంవత్సరాంతము వరకు రాహువు జన్మరాశిలోను, కేతువు **7**ట సువర్ణమూర్తులుగా సంచారము చేయుదురు.*

ఈ రాశివారికి గురుడు జూన్ 16 వరకు జన్మరాశిలో సంచారముచే శరీరశ్రమ అయిననూ, స్వల్ప లాభ ప్రదాయకుడు. భయము, భీతి, శారీరక కష్టము, సదాచారమును అనుసరించుటకు ప్రయత్నము, పెద్దలయందు గౌరవము, సత్ ప్రవర్తన కలిగి వుందురు. సంఘములో గుర్తింపు పెరుగును. స్వల్ప స్థాయిలో ధనలాభము కలుగును. చేయు వృత్తి ఉద్యోగములందు అనుకూలత లేకపోవుట, శ్రమకు తగిన గుర్తింపు లేకుండుట జరుగును. నూతన ప్రయత్న ప్రారంభములో ప్రతికూలత వుండును. జూన్ 16 నుండి గురుడు ద్వితీయ సంచారము రాహువుతో కలియుట వలన కూడా దోషప్రదుడుగానే పరిగణించవలెను. ఫిబ్రవరి 17 నుండి గురుడు ఒక్కడే ద్వితీయమునందు వుండును. ఈ కాలము మిక్కిలి శుభదాయకముగా కుటుంబ వాతావరణము ప్రోత్సాహకరముగా వుండును. ధనమునకు ఇబ్బంది తొలగును. గృహమందు శుభ, పుణ్య, కార్యాచరణ, బంధు మిత్ర సమాగమము, మానసిక ఉల్లాసము, భూ, గృహ, వాహన లాభము కలుగును. రాజకీయ అధికార లాభము, నూతన ప్రయత్నములు ఫలించును.

శని యీ సంవత్సరమంతా జన్మరాశిలో సంచారముచే ఏలిన నాటి శని ప్రక్రియలో రెండవ భాగమందు వుండుట వలన తలచిన కార్యములకు అవరోధములు, అకాల కోపము, పితృ అనారోగ్యము బంధు మిత్రులతో కలహములు, అధిక వ్యయము అనవసరముగా అగును. ఇంటా, బయటా సమస్యలు, మానసిక ప్రశాంతత తగ్గును. శరీర కష్టము, ఛాయ తగ్గుట, భవిష్యత్ గురించి ఆందోళన, దూర ప్రయాణములు వుండును. అవసరమునకు తగిన ధనము అందక ఋణగ్రస్తులగుదురు. సంతానమునకు అనారోగ్య సూచనలు వున్నవి. మతిమరుపు ఎక్కువగా వుండును.

ఈ రాశివారికి గురుడు 2వ స్థానమందు రాహు కలయికచే శ్రమ కల్గించుచూ వృద్ధింప చేయును. ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్‌లు మోసపోవలసివచ్చును. గురు చండాల యోగము, అష్టమ కేతు సంచారము, మానసిక వ్యయము, మిత్ర శతృత్వములు, అప్పుల వ్యయము, నరఘోష, పూర్వ ఆస్తి, గౌరవ వ్యయములను సూచించుచుండును. కోర్టు వ్యవహారములు, ఇతరుల వ్యవహారములందు తలదూర్చరాదు. తరచూ ప్రయాణములు, ఔషధసేవలు కలుగును. బహు జాగ్రత్త. జూన్ తరువాత ద్వితీయ గురు సంచారము కొంత ప్రోత్సాహకరముగ వుండును. మే, జూన్, జూలైలందు కుజ సంచారము వ్యయమును, శత్రుభీతి, స్త్రీ విరోధము, శస్త్ర చికిత్స, అస్థిమితమును సూచించును. ఈ సమయమున మంగళవార నియమములు, అంగారక జప శాంతులు జరిపించుకొనేది.

ఆంగ్లము, ఇంజినీరింగు విద్యార్థులకు కొద్దిపాటి వృద్ధి కలుగును. శాస్త్రవేత్తలకు, సినీ యంత్ర పరిశ్రమల వారికి, కళాకారులకు చాలా నిదానము, వ్యవహార మెలకువ అవసరము.

ఆరోగ్య భంగము, ఔషధసేవ, అవసరమునకు తగిన ఆదాయము అందక ఋణగ్రస్తులగుట, స్థానచలన సూచనలు, అకాల భోజనము, వ్యవహార నష్టము వుండును. పితృవర్గము వారితో కలహములు, సంతాన సౌఖ్యము తగ్గుట వుండును. శని యీ సంవత్సరమంతా లాభమందు సంచారము చేయుటచే యోగదాయకముగా వుండును. ప్రతి పనికి వ్యయ ప్రయాసలు కలిగిననూ చివరకు ఫలితము పొందుదురు. కుటుంబమునందు ఆనందకరమగు వాతావరణము, మానసిక ఉల్లాసము వుండును. శుభ కార్యాచరణ చేయుదురు. భూ, గృహ, వాహన లాభములు, నూతన గృహ నిర్మాణములు, సంఘమునందు సన్మానము, అలంకార ప్రాప్తి, అనుకూల వార్తా శ్రవణము, ఉద్యోగ ప్రయత్నము ఫలించుట. భవిష్యత్ గురించి పలు విధములైన ఆలోచనలు, చివరికి సాఫల్యత పొందుదురు.

ఈ సంవత్సరమంతా శని లాభమందును, సువర్ణమూర్తిగను సంచారము చేయుట అదృష్టప్రదము. అందు శుభ గురుని కలిసియుండుట మరింత విశేషము. గత సంవత్సరములందు జన్మ రాహు సప్తమ కేత్వాది ఛాయాగ్రహముల దోషస్థాన సంచారములచేత తీవ్ర అస్థిమితములు, వ్యవహార భంగములు, ఉదరము, మోకాలు, శిరస్సు సంబంధ అనారోగ్యములను ఎదుర్కొనినను, గుర్వంగారక అనుకూల సంచారముల చేత ఈ సంవత్సరము విశేషించి మంచి ఫలితములనొందుదురు. ఆరోగ్యము క్రమముగా వృద్ధి చెందును. వర్తమాన అవస్థానము నందలి కేతువు ఉచ్ఛస్థితి కలిగిననూ సుఖము నిచ్చును. వ్యాపారస్తులు తాత్కాలిక పెట్టుబడులతో అధికలాభము లాశించవచ్చును. శుభకార్యములు నెరవేరును. భూగృహ నిర్మాణము లందు వ్యవహార దక్షత, ముందు దృష్టి కలిగి సంచరించిన కోర్టు వ్యవహార దోషములుండవు.

ఇంజినీరింగ్, వైద్య విద్య నభ్యసించు విద్యార్థులకు అనుకూలము. వ్యవసాయదారులకు అనుకూలము. పశు సంపద వృద్ధి చెందును. కిరాణా, ఫ్యాన్సీ, నూనె వ్యాపారస్తులకు మిక్కిలి యోగదాయకముగా వుండును. కోళ్ళ పరిశ్రమ, కాగితపు పరిశ్రమ వారికి పూర్వార్థము అనుకూలముగా వుండును. ఉపాధ్యాయులకు, కళాకారులకు, గాయకులకు మిశ్రమ ఫలితములు వుండును. ఇనుము, ఆటోమోబైల్ రంగము వారికి ప్రోత్సాహకరముగా వుండును. రైస్ మిల్లర్లకు సంవత్సర చివర మంచిది కాదు. వస్త్ర, ఫైనాన్స్, రసాయనిక, ధాన్యము వ్యాపారస్తులకు, 6, 7, 10, 12, 2 మాసములు యోగించవు. స్పెక్యులేషన్ యోగించును.

కళాకారులకు గుర్తింపు, శ్రమకు తగ్గ గౌరవలాభములు, అభివృద్ధి కలుగును. విద్యార్థులకు ఉత్సాహవంతమయిన కాలము. అన్ని రంగముల విద్యార్థులకు పదోన్నతి, ఉద్యోగ విజయములు కలిసివచ్చును. కలప, ఇనుము, కిరాణా వ్యాపారస్తులకు సంవత్సరము మధ్య యందు యోగించును.

4, 5 మాసములందు శుక్రుడు భాగ్యరాశి యందు, అంగారకుడు శత్రుస్థానము లందు వక్రముల కలుగుటచే స్త్రీ విరోధములు, శత్రు, ఋణబాధలు, మాట పట్టింపులు, పట్టుదలలు, శిరోవేదనములు కలుగుచుండును. 6, 7 మాసములందు రవి సంచారముచే అధికారిక ఒత్తిడులు, కార్య విలంబనములు కలుగుచుండిననూ మొత్తము మీద మేలే కలుగును. 8, 9 మాసములందు రవి సంచారము బాగున్నది. బంధుమిత్ర ఉన్నతాధికార సందర్భములు, సంపద, చిరకాల ధనలాభములు, అపూర్వ వస్తులాభము, చేయు వృత్తియందు వున్నతి కలుగును. 10, 11 మాసములందు వక్రత్వ గురు శనుల మిశ్రమ సంచారముచే స్థిర కార్య లాభములు. గతంలో నిలచిన లావాదేవీలకు పరిష్కారము లభించుట, స్థిరాస్తులభివృద్ధి, కాని స్వకీయ అపవాదములు, సోదర ప్రేమ గానీ వ్యతిరేకతలుకలుగును. 12, 1 మాసములందు క్లేశములు, ఆరోగ్యవృద్ధి, ఔషధ సేవలు కలుగును. మిగిలిన మాసములందు వ్యవహార విజయము, విద్యా ఉద్యోగాది లాభములు శుభాదులు నెరవేరును. ఆడంబర రీత్యా ధన వ్యయము, దాసదాసీ సుఖము, సింహ పరాక్రమము, స్వయంకృషి వుండును.

పునర్వసు వారు ముత్యం, పుష్య రాగములను - పుష్యమి నక్షత్రము వారు కెంపూ, మయూర నీలమును - ఆశ్లేష నక్షత్రము వారు పచ్చ, కనక పుష్యరాగములను ధరించుట యోగదాయకము.

ఈ సంవత్సరాంతములో గురుగ్రహ శాంతికై గురువార నియమములు, శెనగలు దానమును ఇవ్వవలెను. రాహు, కేతు దోష నివారణకు తరచూ సుబ్రహ్మణ్య అభిషేకములు, ఈశ్వరాభిషేకములు, విష్ణు సహస్ర స్తోత్ర పారాయణ ఉత్తమము.

*స్త్రీలు మంగళ, గురువార నియమములు, సుబ్రహ్మణ్య, దుర్గ, బాలాజీ పూజలు జరిపించిన గర్భిణులకు సుఖప్రసవము, కుటుంబమునందు ఋణ విమోచన, భర్తృ పుత్ర సౌఖ్యములు శాంతి పొందగలరు.*

★★★★



# సింహరాశి

*మఖ : 1,2,3,4 పాదములు, పుబ్బ: 1,2,3,4 పాదములు, ఉత్తర : 1వ పాదము*

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 8 | వ్యయం | - 2 |
| రాజపూజ్యం | - 2 | అవమానం | - 4 |

*ఈ రాశివారికి యీ సంవత్సరములో గురుడు జూన్ 16 వరకు 10ట తామ్రమూర్తి. తదుపరి లాభమునందు లోహమూర్తి. శని యీ సంవత్సరమంతా దశమము నందు లోహమూర్తి. ఫిబ్రవరి 16 వరకు రాహువు లాభమందు, కేతువు పంచమమందు, తదుపరి 10ట రాహువు, 4ట కేతువు లోహమూర్తులుగా సంచారము చేయును.*

గురుడు జూన్ 16 వరకు దశమమునందు సంచారముచే జీవనము సన్మార్గములో నడచును. పెద్దల యందు వినయ విధేయతలు కలిగి వుండుట, సంఘములో కీర్తి, వ్యవహార జయము, సంతాన రీత్యా అసౌఖ్యము కలుగును. కాని ప్రారంభమునందు ఒడిదుడుకులు కల్పించి ఓర్మిని పరీక్షించును. పూర్వ వస్తు విక్రయము, ఆరోగ్య లోపములు కల్పించును. దైవ చింతన, పాపభీతి, పుణ్య కార్యములందు ఆసక్తి, లావాదేవీల యందు స్వల్ప లాభము, కుటుంబము నందు శుభ కార్యాచరణ ప్రయత్నములు ఫలించుట ద్వారా మానసిక శాంతి కలుగును. అసంపూర్తిగామిగిలిన కార్యములన్నీ యీ కాలమునందు పూర్తి అగును. జూన్ 16 నుండి గురుడు లాభస్థానములో సంచారముచే ఆకస్మిక ధన లబ్ధి, సోదర, సోదరీల మధ్య ప్రేమానురాగాలు బలపడుట, నీచ జన సాంగత్యము, పరాన్న భుక్తి, పరగృహ వాసముపై మక్కువ, కళత్ర, పుత్ర, మిత్ర, అనారోగ్యము కలుగు సూచనలు కలవు. సేవకాజనము వలన లబ్ధి పొందుట, ధర్మ బుద్ధి వీడుదురు. భూ, గృహ, నిర్మాణాదులందు కొంత ప్రతిష్టంభన ఏర్పడును. పరనిందలకు గురి అగుదురు.

శని, దశమ స్థానములో యీ సంవత్సరమంతా సంచారము చేయును. దీని వలన స్థాన బలము, ఆరోగ్యము చేకూర్చును, దైవ, పుణ్య కార్యక్రమముల ద్వారా దన వ్యయము కలుగును. ప్రతీ కార్యమునందు తక్కువ ఆసక్తిని ప్రదర్శించి వచ్చిన అవకాశములను చేజార్చుకొందురు. తలచిన కార్యక్రమములను వాయిదా వేయుట మంచిదికాదు. విచక్షణములతో ఆలోచించి కార్యోన్ముఖులై వుండవలయును. ప్రతి పనిని ఆలస్యముగా చేయుటకు ఇష్టపడుదురు. విదేశ, దూర ప్రయాణములను ఆశింతురు. శరీర ఛాయ కొంత తగ్గును. భూ, గృహ, నిర్మాణాదులు కలిసి వచ్చును. స్వల్ప స్థాయిలో ధనమును నిల్వ చేయుదురు. ఆరోగ్య విషయములో జాగ్రత్త అవసరము. తగాదా వ్యవహారములకు దూరముగా వుండుట మంచిది. దశమ కేంద్రమందు శని స్థిరస్థానవంతుడగుచుండగ అనేక క్రూర సమస్యలను ఉత్పన్నము చేయగలడు. కానీ పూర్ణశుభుడైన గురుడు శని కలిగించు దోషములను తగ్గించి, దైవకార్యాచరణములు, వ్యవహార విజయములు, స్థిరాస్తులు కొనుగోలు, భారీ వ్యాపారములు చేయించును. శ్రమకు మించిన మంచి ఫలితములిచ్చును.

ఈ రాశివారు సింహ పరాక్రమవంతులగుటచే భవిష్యత్‌కు, సంఘములకు ఉపయోగించు సత్కార్యములను నిర్వహించుదురు. అధికార సమర్థతలో వీరికి వీరే సాటి అని మెప్పు పొందుదురు. ఎంతటి కార్యమునైనా నిర్వహించుటకు సమర్థులే.

4, 5 మాసములందు పౌరుషము, కార్య సాఫల్యత, సంతానాది జాగ్రత్తలు, ఆభరణ లాభములు, శస్త్ర లాభము. 6, 7 మాసములందు శుభ మూలక లాభములు, సర్వ వ్యయములు, తరచూ ప్రయాణములు, నోటిపూత, ఉదర అసౌఖ్యము, శత్రుపీడ, దోషనివారణకు అంగారక శాంతులు. 8, 9 మాసములందు ఆటంకములతో కార్యసాఫల్యత, మనోధైర్యములు, సాంఘిక సేవలలో పాల్గొనుట, వ్యవహారదక్షత కలుగును. స్నేహములు, వృత్తియు అభివృద్ధి కలుగును. 10, 11 మాసములందు వ్యవహార యాతిబాధలు, శ్రమ, త్రిప్పుట, ఛాయ తగ్గుట, ఔషధసేవలు చేయుట, మౌనము నిదానము వహించిన లాభము కలుగును. 12, 1 మాసములందు శుభాదులు కలసి వచ్చును. వ్యవహారిక ఆకస్మిక అలజడులు, శని గురు వక్రములచే ఆకస్మిక స్థాన చలనములు, అనూహ్య వ్యత్యాస ఫలితములు కలుగుచుండును. మిగిలిన మాసము లందు ఉత్సాహము, ఆరోగ్యవృద్ధి కలుగును.

విద్యార్థులకు యీ కాలము యోగవంతమైన కాలము. తగిన ప్రణాళిక రూపొందించుకొని విజయం సాధింతురు. వైద్య, ఇంజినీరింగ్ విద్యార్థులకు ఇది మిక్కిలి అనుకూల కాలము. వ్యవసాయదారులకు యీ సంవత్సరమంతా యోగించును. పశుసంపద, అపరముల పంట లాభసాటిగా వుండును. వ్యాపారస్తులకు అనుకూల కాలముగా వుండును. మత్స్య పరిశ్రమ వారికి వ్యతిరేక ఫలితములుండును. కోళ్ళు, కాగిత పరిశ్రమ వారికి మిశ్రమ ఫలితములుండును. నూతన ప్రయత్నములు వ్యాపారస్తులకు అనుకూలించును. గాయకులకు, కళాకారులకు, ఉపాధ్యాయులకు అనుకూల కాలము. ఇనుము, నూనె, కలప, యంత్ర వ్యాపారస్తులకు అనుకూలముగా వుండగలదు.

మఖ నక్షత్రము వారు కృష్ణ వైఢూర్యము, పగడము ధరించి మంగళవారములు, దుర్గా ఆంజనేయ, అంగారక స్తోత్రములు చేసిన విశేషముగా యోగించును. పుబ్బ వారు వజ్రము, పచ్చ ధరించిన, శుక్ర వారములు చేసిన ధన ప్రదము. ఉత్తరానక్షత్రము వారు కెంపు, పుష్యరాగము ధరించి ఆదివారములు చేయుట, సూర్యనమస్కారములు, సుబ్రహ్మణ్య లలితా పూజలు చేసిన లక్ష్మీప్రదము.

స్త్రీలు గురు, శుక్రవార నియమములు, హనుమ, సాయి, లక్ష్మీ స్తోత్రములు చేసిన, కనకధార స్తవము చదువుట వలన దుస్వప్న దోష నివారణ జరిగి, ఆదాయము గృహశాంతులు కలిగి అన్నింట ముందంజలో వుందురు.

★★★★



# కన్యారాశి

*ఉత్తర : **2, 3, 4** పాదములు, హస్త : **1, 2, 3, 4** పాదములు, చిత్త : **1, 2** పాదములు*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | - | **11** | వ్యయం | - | **8** |
| రాజపూజ్యం | - | **5** | అవమానం | - | **4** |

*ఈ రాశివారికి యీ సంవత్సర కాలములో గురుడు జూన్ **16** వరకు భాగ్యము నందు రజితమూర్తి. తదాది దశమమునందు తామ్రమూర్తి. శని ఈ సంవత్సరమంతా భాగ్యమునందు సువర్ణమూర్తి. రాహువు ఫిబ్రవరి **16** వరకు **6**ట, కేతువు **4**ట సువర్ణమూర్తులు. తదుపరి రాహువు **9**ట, కేతువు **3**ట తామ్రమూర్తులు.*

గురుడు జూన్ 16 వరకు భాగ్యసంచారముచే యోగవంతముగా వుండును. ఉన్నత వ్యక్తులతో పరిచయములు, ఉద్యోగ ప్రయత్నములు, భాగ్యవృద్ధి కలుగును. అదృష్టము కలిసి వచ్చును. చిరకాలము నుండి నిలిచిన కార్యములన్నీ సాఫల్యము పొందును. వివాహ ప్రయత్నములు నెరవేరును. కుటుంబము నందు శుభ పుణ్య కార్యాచరణ, బంధు మిత్ర సఖ్యత, దైవక్షేత్ర సందర్శనములు చేయుదురు. భూ, గృహ నిర్మాణములు, దూర ప్రయాణములు అనుకూలించును. జూన్ 16 నుండి గురుని దశమ సంచారము వలన కొద్ది దోష ఫలితములను ఇచ్చును. ఈ కాలములో ఎంత కూడదనుకున్నా పొరపాట్లు చేయుదురు. తొందరపాటు పనికిరాదు. వ్యవహార నైపుణ్యమును ప్రదర్శింతురు. పుణ్య కార్యములు చేయుట యందు మక్కువ హెచ్చు. స్వల్ప అశాంతి వుండును. చేయు ఉద్యోగ, వృత్తి వ్యాపారములందు గతము కంటే ధనాదాయము పెరుగును. విదేశీ ప్రయాణములు అనుకూలించవు. అతి ప్రయాసల ద్వారా కుటుంబ సమస్యలు పరిష్కారమగును.

శని ఈ సంవత్సరం భాగ్యమందు సంచారము చేయు కాలములో శారీరక, మానసిక పీడ హెచ్చు. కార్యములు ఆలస్యములు అయిననూ ప్రయత్న పూర్వకము ద్వారా నెమ్మదిగా నెరవేరును. ఔషధ సేవ తప్పనిసరి. పితృవర్గము వారితో విరోధము, భాగ్యనష్టము, అప్పుడప్పుడూ బంధు వైరము, ఉదర వ్యాధి కలుగును. ఎంతటి కార్యమునైననూ బరువు మోయుచూ ముందుగు సాగిపోదురు. మనస్సు పరిపరి విధములుగా ఆలోచించుచుండును. రాహువు ఫిబ్రవరి 16 వరకు దశమములోనూ, కేతువు చతుర్థ స్థాన సంచారము వలన విశేష శుభ ఫలములు పొందుదురు. ఉద్యోగ ప్రయత్నములు, వ్యవహార లాభములు, భూ, గృహ నిర్మాణములు కలిసివచ్చుట. నూతన ప్రయత్నములు సఫలత, రాజకీయ నాయకులకు ఉన్నత పదవులు సిద్ధించును. మానసిక ఉల్లాసము, బంధుమిత్ర సమాగమము, భాగ్య వృద్ధి, కార్యాచరణ కలుగును. దూర ప్రయాణములందు అనుకూలత వుండును. తదుపరి సంచారము. స్వల్పస్థాయిలో దోషములు, పితృవర్గము వారితో విభేదములుండును.

4, 5 మాసములందు చోర, శత్రుపీడలు, వ్యాపారములకై పెట్టుబడులు, తరచూ కోపము వచ్చుట, కృశించిన శరీరము, తక్కువ ఛాయ. అయినను ఉత్సాహవంతమైన ఫలితములు 6, 7 మాసములందు వ్యాపార, వ్యవసాయాదులకై, ఉద్యోగ, విలాస వస్తువులకై ధనవ్యయము, మానసికోల్లాసములు, తరచూ ఆలోచనలు, ప్రయాణములు ఎక్కువగును. 8, 9 మాసములందు ధనవ్యయము, పరీక్షత్వము కలుగును. పరిస్థితులు క్రమేణా అనుకూలించును. 10, 11 మాసము లందు ఆరోగ్యం, భోగము నేర్పరితనము, బంధుమిత్రుల ద్వారా శుభాశుభము లందు పాల్గొనుట, ఋణవిముక్తి, ఉత్సాహము, మృష్టాన్నభోజనము, అలంకార ప్రాప్తి కలుగును. మంచి కాలముగా భావించవచ్చును. 12, 1 మాసములందు గురు, శనుల వక్రముచే అంగారక దోష సంచారముచే వ్యవహార నిలుపుదల, స్థిరములకై

ధనవ్యయము, ఉద్యోగాది ప్రయత్న ఆశా భంగము, తరచు నేత్ర, ఆరోగ్యలోపములు, పరపీడనం, తిరుగుట కలుగు చుండిననూ, ఫలితములు ఉత్సాహవంతములగును.

మిగిలిన మాసములందు ఛాయా గ్రహముల దోషచలనముచే శత్రువృద్ధి, కలహ ప్రియత్వము కానీ అనుకూల్యత చాలా బాగుండును. భూ లాభములు, శుభకార్య దైవకార్య నిర్వహణము, స్వల్ప కార్యభంగములు, ధన వ్యయములు కలుగుచున్నను బంధు మిత్ర ఆదరణ, సాంఘిక, సారస్వత, ప్రసంగములు కలుగుచుండును. మంచి కాలముగా చెప్పవచ్చును.

వ్యవసాయదారులకు శ్రమ ఎక్కువగా ఉండును. ఉత్తరార్థము కంటె ప్రథమార్థము అనుకూలముగా వుండును. యంత్ర, ఇనుము, కిరాణా వ్యాపారులకు అనుకూలము. రియల్ ఎస్టేట్ రంగము వారికి లాభసాటిగా ఉండును. వ్యాపారస్తులకు స్వల్పస్థాయిలో లాభములు ఉండును. మొదట తలచిన పనులు స్తంభించిన తదుపరి ప్రయత్నము మీద ఫలించును. నూతన శుభకార్యములు నిదానించి ఆచరించుట మేలు.

ఉత్తరా, హస్త నక్షత్రముల వారు కెంపు, నీలమణి ధరించవలెను. దీని వలన ధన లాభము, మనస్సుకు ఆనందము కార్యసాఫల్యత కలుగును. చిత్తా నక్షత్రము వారు పగడము, నీలము ధరించవలెను. దీని వలన ధన లాభము, భూ, గృహ లాభము పొందుదురు.

ఈ రాశివారు సుబ్రహ్మణ్య అభిషేకములు, గురు, శని, రాహువులకు జపములతో పాటు మహామృత్యుంజయ జపములు చేయించుట, శనీశ్వర తైలాభిషేకములు, ఈశ్వరారాధన, ఆలయ ప్రదక్షిణలు చేయుచుండిన అప మృత్యుదోషము తొలగును. శని, గురువార నియమములు పాటించవలెను.

*స్త్రీలు గురు, శుక్రవార నియమములు, పుష్యరాగాభరణములు ధరించుట వలన, గణేశ, ఆంజనేయ, దుర్గా స్తోత్రములు చేయుట వలన, కుటుంబములో భర్త, పుత్ర ఆరోగ్య, అన్యోన్యతలు, ఋణవిముక్తి కలిగి శాంతి నొందెదరు.*

★★★★



# తులారాశి

*చిత్త : **3, 4** పాదములు, స్వాతి : **1, 2, 3, 4** పాదములు, విశాఖ : **1, 2, 3** పాదములు*

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | 8 | వ్యయం | 11 |
| రాజపూజ్యం | 1 | అవమానం | 7 |

*గురుడు యీ రాశివారికి జూన్ **16** వరకు అష్టమము నందు లోహమూర్తి. తదాది భాగ్యము నందు సువర్ణమూర్తి. శని యీ రాశి వారికి యీ సంవత్సరమంతా అష్టమమునందు తామ్రమూర్తి. రాహువు ఫిబ్రవరి **16**వరకు **9**ట, కేతువు **3**ట తామ్రమూర్తులు. తదుపరి రాహువు **8**ట, కేతువు **12**ట సువర్ణమూర్తులు.*

గురుడు జూన్ 16 వరకు అష్టమరాశిలో సంచారముచే తలచిన పనులు అతి కష్టము మీద పూర్తి చేయుట. స్వజన విరోధము, అకాల భోజనము, శరీర శ్రమ, అలసట, త్రిప్పుట, అవసరమునకు తగిన ధనము లభించక ఋణగ్రస్తులగుదురు. వివాహాది శుభ ప్రయత్నములు సంక్లిష్టముగా మారి చివర ప్రయత్నములో నెరవేరును. అనారోగ్య బాధలు వుండును. ఔషధ సేవ తప్పనిసరి అగును. స్థానచలనము, దేహపీడ, ధన వ్యయము అనవసరముగా చేయుదురు. జూన్ 17 నుండి భాగ్యరాశి సంచారము గురునికి శుభమయినప్పటికీ, ఫిబ్రవరి 16 వరకు రాహువుతో కలిసి వుండుట వలన గురు ఛండాల యోగము ఏర్పడి శుభ ఫలములు ఇవ్వజాలడు. ఫిబ్రవరి 17 నుండి గురుడు ఒక్కడే భాగ్యరాశి సంచారము వలన శుభఫలములు ఇచ్చు అవకాశములు కలవు. గత సంచారము కంటె కొద్దిమేలు కలిగించును. గృహలాభము, బ్రాహ్మణభక్తి కలుగును. పితృవర్గము వారితో విరోధములు, కోర్టు వ్యవహారములు అనుకూలించకపోవుట, సదాచారములు పాటించకపోవుట జరుగును. నీచ జన సాంగత్యము వలన స్వల్ప లాభము కలుగును. అయిననూ జూన్ 16 నుంచి గురుని సంచారము గత రెండు సంవత్సరముల కంటే మేలు కలిగించును. శని అష్టమరాశి సంచారముచే వ్యవహారములు నిలుపుదల చేయుట, నూతన వ్యాపార భాగస్వామ్యములందు నిదానించి మెలగుట, తగ్గించుట సర్వశ్రేయస్కరము. వ్యాపారులకు మిశ్రమ ఫలితములుండును. స్వయంవృత్తి వారలకు స్థానిక సమస్యలు ఉత్పన్నములగు చుండిననూ స్వయంకృషితో కీర్తి గౌరవము లార్జించుదురు.

విద్యార్థులు అత్యధిక శ్రమచేసిన గానీ ఉత్తీర్ణులు కాలేరు. ఇంజనీరింగు, న్యాయవాద, టెక్నికల్ విద్యార్థులకు కొంత మంచి ఫలితములే. భాషా పండితులకు లెక్చరర్లకు ఆకస్మిక బదిలీలు వుండును. వ్యవసాయదారులకు శ్రమ మిగిలును. జాయింట్‌లు, నిలవలు కలసిరావు. కిరాణా, కలప, గృహోపకరణములు, యాంత్రికములు, నూనెలు, రసాయనిక వ్యాపారులకు సం॥ ప్రారంభాంత్యములందు బాగుగా కలిసివచ్చును. ఇనుము, బొగ్గు, నూనె, ఉప్పు మొదలగు వ్యాపారస్తులకు లాభసాటిగా నుండును. షేర్లు దూర యానములు ఫలించవు. రైస్‌మిల్లర్లు, మత్స్య పరిశ్రమల వారికి 6, 7, 8, 11, 12, 2 మాసములు విశేషముగా ఫలించును. కాంట్రాక్టర్లకు ఇనుము, సిమెంటు, ఇండస్ట్రీ వ్యాపారులకు సంవత్సర పూర్వార్థము కొన్ని సమస్యలు ఎదురై ఉత్తరార్థమున యోగించును. రాజకీయములు అనుకూలించదు.

4, 5 మాసములందు భాగ్యవృద్ధి, మాటపై నుండుట, సంఘములో సద్విమర్శలందుకొనుట, భూప్రయత్నములు కొంతవరకు ఫలించుట, బంధుజన సాంఘికములకై సద్వ్యయములు వుండును. 6, 7 మాసములందు శుభవర్తమానములు, శయ్యాసౌఖ్యము, సోదరప్రేమ, అయత్న ధన లాభములు వుండును. గురు మార్పుచే ఆరోగ్యరీత్యా వైద్యసేవలు తద్వారా ఔషధసేవలు చేయవలసి వచ్చును. మేలే కలుగును. 8, 9 మాసములందు ఆనందము, పిమ్మట ధనవ్యయము, వ్యవహార నిలబాటు, మాట తొందర, శరీర ఆయాసము, నీరసము సూచించును. 10, 11 మాసములందు ధన లాభవ్యయములు, స్థానచలన చింత, శత్రుపీడలు, మిత్ర శత్రుత్వములు కలుగుచుండును. శుభ గురుని దృష్టిచే దోషములు, నిదానముచే నివారితమగును. 12, 1 మాసములందు సంతానాది ఆరోగ్య లోపములు మరియు ధనసిద్ధి, శత్రుమిత్రత్వములు, శారీరక రుగ్మతలు అప్పుడప్పుడు మనోవ్యాకులత, వ్యవహార మిశ్రమ ఫలితములు కలుగుచుండును. శని వక్రముచే నిదానము, దైవశాంతుల ద్వారా శాంతి పొందవచ్చును. మిగిలిన మాసములందు రాహు కేతు దోష సంచారములచే రుద్రాభిషేకములు, నవగ్రహ ధ్యానములు, ధాన్య దానములు చేయుచుండిన మేలు కలుగును.

మొత్తంమీద ఈ రాశి వారికి అష్టమమందు గురుడు, శని గ్రహాల సంచారము దోషప్రదముగా వుండి అశుభ ఫలములు హెచ్చు స్థాయిలో జరుగును. దీని నివారణకు గురు, శనులకు జపములతో బాటు మహా మృత్యుంజయ జపములు చేయించుట. శనీశ్వర తైలాభిషేకములు, ఈశ్వరారాధన, సుందరకాండ పారాయణము చేసిన అపమృత్యు దోషములు తొలగును. గ్రహశాంతి జరిపించిన శుభ కార్య నిర్వహణ, గృహనిర్మాణాది లాభములు, ఉద్యోగోన్నతి శుభముగా నెరవేరును.

చిత్త నక్షత్రము వారు పగడము, నీలము ధరించవలెను. శని వారములు చేయవలెను. స్వాతి నక్షత్రము వారు గోమేధికము, ముత్యము ధరించిన ఉత్సాహము కలిగియుందురు. ధన లాభము కలుగును. సోమవారములు చేయవలెను. చంద్రశేఖరాష్టకము చదువవలెను. విశాఖ నక్షత్రము వారు ముత్యము, కనక పుష్యరాగము ధరించవలెను. గురువారములు, హయగ్రీవ స్తోత్రములు చేయవలెను.

*స్త్రీలు సోమ, మంగళ వారములు ఆచరించిన లలితా, గణేశ్వర, ఆంజనేయ, సుబ్రహ్మణ్య పూజలు చేయుచుండిన గృహమందు స్థిరలక్ష్మీ, కుటుంబ ఆనందము, సంతానవృద్ధి, ఋణవిముక్తి కల్గును.*

★★★★



# వృశ్చికరాశి

*విశాఖ : **4**వ పాదము, అనూరాధ : **1, 2, 3, 4** పాదములు, జ్యేష్ఠ: **1, 2, 3, 4** పాదములు*

| | | | | | |
|---|---|---|---|---|---|
| | - | 14 | వ్యయం | - | 2 |
| రాజపూజ్యం | - | 4 | అవమానం | - | 7 |

*ఈ రాశివారికి గురుడు జూన్ **16** వరకు సప్తమ స్థానమందు, తదుపరి అష్టమరాశియందు రజితమూర్తిగా సంచారము. శని యీ సంవత్సరమంతా సప్తమ స్థానమందు రజితమూర్తి. రాహువు యీ సంవత్సర ఆరంభము నుంచి ఫిబ్రవరి **16** వరకు అష్టమరాశియందును, కేతువు ద్వితీయము నందును, ఫిబ్రవరి **17** నుంచి రాహువు సప్తమ కేంద్రమందు, కేతువు జన్మరాశి యందు రజితమూర్తులే.*

గురుడు జూన్ 16 వరకు సప్తమరాశి యందు సంచారము చేయును. ఈ కాలమునందు గురుడు శుభాశుభ ఫలముల నిచ్చును. మంచి నడవడిక కలిగి సత్ పురుషుల పరిచయము ఏర్పడును. ధనమునకు స్వల్ప ఇబ్బంది, కొద్దిపాటి శ్రమ, అలసటకు గురి అగుదురు.

జీవన విధానములో ఒడిదుడుకులు కల్పించును. దైవచింతన, పాపభీతి ఏర్పడును. పుణ్యకార్యములందు ఆసక్తి హెచ్చు. భూగృహ నిర్మాణములు చేయుదురు. సోదరీ వర్గీయులతో ప్రేమ, సంతానమునకు కొద్ది అసౌఖ్యము ఏర్పడును. జూన్ 16 నుంచి యీ గురుడు అష్టమరాశి సంచారము దోషప్రదము. యీ కాలములో అకాల భోజనము, మానసిక అశాంతి, ధనమునకు ఇబ్బంది, మనోవాంఛ నెరవేరకపోవుట వుండును. తలచిన వ్యవహారములు కష్టనష్టములలో ప్రారంభమయి చివరి ప్రయత్నములో పూర్తి అగును. తొందరపాటు తగదు. ఓర్మితో వ్యవహరించిన అన్ని పనులు సాఫల్యత కలుగును. దూర ప్రయాణములు చేయుదురు. అనవసరమైన కార్యములకు దుబారా చేయుదురు. స్వజన విరోధము, పిత్రార్జిత వ్యయము, గుహ్యరోగము, శరీరశ్రమ, అలసట, త్రిప్పుట వుండును. భూ, గృహ నిర్మాణాదులు అధిక శ్రమ మీద అధిక ధన వ్యయంతో పూర్తి చేయుదురు. కుటుంబము నందు కొద్దిపాటి అశాంతి, సంతానమునకు అనారోగ్యము ఏర్పడును.

శని ఈ సంవత్సర కాలములో సప్తమమందు సంచారము చేయును. ఈ కాలములో దగ్గర బంధు వ్యయము ద్వారా మానసిక అశాంతిని, భాగ్యస్థిరత్వమును, ఆడంబరముల రీత్యా వ్యయము కలిగించును. ఇరుగు పొరుగువారితో సఖ్యతగా, తగాదా వ్యవహారములకు దూరముగా వుండవలెను. శారీరకముగా అలసట, మనఃక్లేశము కల్పించును. ప్రయాణములందు జాగ్రత్త అవసరము. మధ్యకాలమునందు భూమి సంబంధ వ్యవహారములు అగును. ఆదాయము స్వల్పస్థాయిలో పెరుగును. కళత్ర వర్గము వారితో విరోధము, కళత్రమునకు అనారోగ్యము తద్వారా ధన వ్యయము, స్థానచలనము, బంధు అప్రియత పరగృహ వాసము కలుగును.

- 4, 5 మాసములందు భాగ్యహాని, నేత్రము, కంఠము సంబంధ ఆరోగ్య లోపము, తరచూ చర్మవ్యాధులు, అకారణ కోపములు పరనిందలు కలుగుచుండును. 6, 7 మాసములందు నేత్ర ఆరోగ్య లోపములు శస్త్ర చికిత్సలు, వ్యాపార పెట్టుబడులు తగ్గించుట మేలు. అష్టమ గురు ప్రవేశము శ్రమ మానసిక ఒత్తిడులు, ధనవ్యయము వుండును. ప్రయాణములు వాయిదా మంచిది. వ్యవహారములందు తల దూర్చరాదు. 8, 9 మాసములందు కార్యసిద్ధి, మృష్టాన్న భోజనము, మానసికోత్సాహము, ఆకస్మిక ధనలబ్ధి, ఆరోగ్యవృద్ధి ఆభరణ లాభము, వ్యవహార దక్షత, లాభసాటి కలుగును. 10, 11 మాసములందు ప్రారంభమున ఆటంకములు, తర్వాత సిద్ధి కలుగును. బంధుమిత్రుల ఆదరణ, పుత్రాది ఉద్యోగ, విద్యలకై, పన్నులకై ధనవ్యయము, సేవకజన ధనలాభము, 12, 1 మాసములందు భూ గృహ మార్పు చేర్పులకై ధనవ్యయము, రాజకీయ నాయకుల స్నేహము, పలుకుబడి, పితృవర్గములో కొద్దిపాటి అనారోగ్యము, ధనవ్యయములు, వాతావరణ రీత్యా అశాంతి కలుగుచుండును. మనోధైర్యముతో మంచిని పొందగలరు.

విద్యార్థులకు మిశ్రమ ఫలితములు హెచ్చుగా వుండును. వ్యవసాయదారులకు పూర్వార్థము మేలు. ఉత్తరార్థము సామాన్యము. పశు సంపద క్షీణించును. వ్యాపారస్తులు జాగ్రత్తగా వ్యవహరించు కొనవలెను. బహు కష్టకాలము. నూతన ప్రయత్నములు శ్రమ మీద ఫలించును. ఇనుము, నూనె, యంత్ర వ్యాపారస్తులకు అనుకూలముగా వుండును. స్పెక్యులేషన్ – జాయింటువ్యాపారములు యోగించవు.

మొత్తంమీద ఈ రాశి వారికి సంవత్సర ప్రారంభమున అంగారక దోషము సం॥రం మధ్యయందు శని, గురుల వక్రము అశాంతిని సూచించును. శుభకార్యములు, గృహ నిర్మాణములు దూరదృష్టితో నిలుపుదల చేయుట ఉత్తమం. గురువార నియమములు, సుబ్రహ్మణ్యేశ, ఈశ్వర అభిషేకములు, లక్ష్మీ నారాయణుల పూజలు చేయుచుండవలెను. సంపూర్ణ నవగ్రహ శాంతులు అవసరము. తెల్లని పుష్యరాగాభరణ ధారణ యీ రాశివారికి యీ సంవత్సరం చాలా శాంతి నిచ్చును.

విశాఖ నక్షత్రము వారు పుష్యరాగము, ముత్యము ధరించిన మేలుగా వుండును. సోమవార, గురువార నియమములు పాటించుట మేలు. సూర్య నమస్కారములు చేయుట మంచిది. అనూరాధ నక్షత్రము వారు నీలమణి, పగడము ధరించిన ఋణబాధలు తొలగి పరిస్థితులు చక్కబడును. జ్యేష్ఠ నక్షత్రము వారికి పచ్చకంటే పుష్యరాగము మేలు. విష్ణుసహస్రనామము పూజ, మంగళవార నియమములు చేయుట మంచిది.

ఈ రాశివారు ఏప్రియల్ నుంచి ఆగష్టు వరకు కుజుని దోష నివారణకు పూజలు జరిపించుకొనిన దోష నివారణ జరిగి మంచి ఫలితములు పొందగలరు.

*స్త్రీలు, మంగళ శుక్రవారములు, దుర్గా, సుబ్రహ్మణ్య నవగ్రహ పూజలు చేయుచుండిన కుటుంబమందు శాంతి, సంతాన సౌఖ్యము, ఋణ విముక్తి భర్తృ సౌఖ్యము పొందగలరు.*

★ ★ ★ ★



# ధనూరాశి

మూల : 1, 2, 3, 4 పాదములు, పూ.షా. : 1, 2, 3, 4 పాదములు, ఉ.షా. : 1వ పాదము

| ఆదాయం - 2 | వ్యయం - 11 |
|---|---|
| రాజపూజ్యం - 7 | అవమానం - 7 |

ఈ రాశివారికి గురుడు యీ సంవత్సరం జూన్ 16 వరకు షష్ఠమరాసి యందు సువర్ణమూర్తి. తదాది జూన్ 16 నుండి సంవత్సరాంతము వరకు సప్తమరాశి యందు లోహ మూర్తి. శని యీ సంవత్సరమంతా షష్ఠరాశి యందు సువర్ణమూర్తి. రాహువు యీ సంవత్సర ప్రారంభం నుండి ఫిబ్రవరి 16 వరకు 7ట, కేతువు 1ట తదుపరి రాహువు షష్ఠ రాశి కేతువు వ్యయస్థానము నందు లోహ మూర్తులే.

గురుడు ఈ రాశి వారికి జూన్ 16 వరకు షష్ఠమ రాశియందు సంచారము చేయును. యీ కాలములో శుభాశుభ ఫలమును ఇచ్చును. ప్రతి పని యందు ఓర్మిని పరీక్షించి వ్యవహారములను ఆలస్యముగా పూర్తి చేయించును. శయ్యా సౌఖ్యము లోపించుట, సుఖమునకై ఆరాటము ఆడంబర వ్యయము ఎక్కువగా వుండును. ఉద్యోగ ప్రయత్నములు ఫలించకపోవుట, తనకన్నా తక్కువ వారితో అభిప్రాయభేదములు, మేనమామ వర్గమురీత్యా అపకారము కలుగును. తదుపరి కాలము జూన్ 16 నుండి గురుడు సప్తమ మందు రాహువుతో కలిసి ఫిబ్రవరి 16 వరకు సంచారము చేయును. యీ కాలములో నీచ జన సాంగత్యము, తగాదా వ్యవహారములందు తలదూర్చుట, మ్లేచ్ఛ సంప్రదాయము ఆచరించుట యందు ఆసక్తి, సత్ సంప్రదాయము విడనాడుట, పరుషమైన వాక్కును కలిగి వుందురు. అధికార భీతి, ఉద్యోగ వ్యవహారములందు అసౌకర్యము, జ్వరపీడ, మాతృవర్గము వారితో అభిప్రాయ భేదములు, కుటుంబమునందు కొందరికి అనారోగ్య సూచనలు కలవు. ఔషధ సేవ తప్పని సరి. ఫిబ్రవరి 17 నుంచి గురుడు ఒక్కడే సప్తమమునందు సంచారము చేయును. యీ కాలము యోగ దాయకముగా వుండును. బంధు మిత్ర లాభము, సత్ ప్రవర్తన, పెద్దలయందు గౌరవము, శుభ కార్యక్రమములు నిర్వహించుట. ఉత్సాహముగా పాల్గొనుట వుండును. గతములో వున్న ధన ఇబ్బందులు తొలగి కొద్ది మొత్తములో ధనమును నిల్వ చేయుదురు. భూ, గృహ నిర్మాణ పనులు శుభ ప్రదముగా పూర్తి చేయుదురు.

శని యీ సంవత్సరములో షష్ఠరాశి యందు సంచారము మిక్కిలి శుభప్రదముగా వుండును. బంధు మిత్ర సమాగమము, శుభ పుణ్యకార్యాచరణ, వ్యవహార జయము, సంఘములో గౌరవము పెరుగుట వుండును. భూ, గృహ, వాహన, సౌఖ్యములు లభించును. నూతన ప్రయత్నములు, నిర్మాణములు కలసివచ్చును. మనోవాంఛ నెరవేరును. నూతన వస్తు లాభము, విచిత్ర వస్తు సేకరణ, అన్ని రంగములందు లాభసాటిగా జీవనము ఉన్నత పదములో సాగిపోవును.

4, 5 మాసములందు జన్మాంగారక, శత్రుస్థాన శని, గురుల, ఛాయా గ్రహ సంచారములు మంచివి కాదు. అనవసర దుష్టాలోచనలు, శస్త్ర చికిత్సలు, వాహన ప్రమాదములు సూచించును. అన్ని రంగముల వ్యాపారులు అప్రమత్తత పాటించాలి. చిరకాలము నుండి రావలసిన ఆర్థిక లాభములు, అపూర్వవస్తు సంగ్రహణము లుండును. 6, 7 మాసములందు శ్రమచే అనుకూల ఫలితములు మానసిక అస్థిమితములు, స్వకీయ శత్రువృద్ధి కలుగుచుండును. వ్యవహారములు కొద్ది కదలికలు కలిగి నిలబాటు చెందును. 8, 9 మాసములందు ఇంటా బయటా వ్యవహార సమస్యలు, శిరోవేదనములు, శస్త్ర చికిత్సలు భేదములు కలుగుచుండును. ఈ మాసములందు గ్రహ గమనం చాలా చెడ్డది. 10, 11, 12 మాసములందు లక్ష్మీవృద్ధి కలుగును. కొద్దిపాటి శత్రువృద్ధి, వ్యవహార చింతనములు, రోగ భయములు, ధన వ్యయములు సూచించు చుండిననూ శుభ గురుని దృష్టి వలన తటస్థ ఫలితములు కలుగునని ఆశించవచ్చును. మిగిలిన మాసములలో జన్మ, సప్తమరాశిలోని పాపాల గ్రహములు తొలగుట వలన, భోగము, లాలసత్వము, మాట నేర్పరితనము, గతం కంటే కొద్ది ఆదాయం పెరుగుట అన్ని రంగముల వృద్ధిగా వుండును. కానీ అశాంతి శేషము ఉండును.

విద్యార్థులకు మిక్కిలి ప్రోత్సాహకరముగా, ఇంజినీరింగ్, వైద్య రంగంలోని వారికి అనుకూలముగా వుండును. వ్యవసాయదారులకు పూర్వార్థము కంటె ఉత్తరార్థము ఉత్సాహకరముగా వుండును. పూర్వార్థములో ద్రవ్య వ్యయము ఎక్కువగా వుండును. వ్యాపారస్తులకు లాభసాటిగా వుండును. కిరాణా, ఫ్యాన్సీ, కలప, వస్త్ర పరిశ్రమకు మిక్కిలి లాభదాయకముగా వుండును. ప్లీడర్లకు, రియల్ ఎస్టేట్ రంగములోని వారికి పూర్వార్థము మేలుగా వుండును. గాయకులకు, కళాకారులకు, ఉపాధ్యాయులకు ద్వితీయార్థము లాభసాటిగా వుండును. ఇనుము, నూనె, యంత్ర వ్యాపారస్తులకు ప్రోత్సాహభరితముగా వుండును.

మూల నక్షత్రము వారు వైఢూర్యము, కనకపుష్యరాగములు ధరించిన విశేష శుభ ఫలితము పొందుదురు. పూర్వాషాఢ నక్షత్రము వారు పగడము, ఉత్తరాషాఢ నక్షత్రము వారు కెంపు, పచ్చలు ధరించుట శుభము.

మొత్తంమీద ఈ రాశివారు సుబ్రహ్మణ్య అభిషేకములు, దుర్గా, రుద్ర సహస్ర నామ పారాయణము, శ్రీ సుందరకాండ పారాయణము చేసి గురువార నియమములు ఆచరించుట, అభిషేకములు చేయుట ద్వారా రూపము, బరువు తగ్గక వ్యవహార నిలుపుదలతోను స్వల్ప ధనవ్యయములతోను, వృద్ధిగా ముందుకు కొనసాగుచుందురు. మంచి ముత్యము, కనక పుష్యరాగాభరణము ధరించుట ద్వారా ఆరోగ్యమునకు, మనశ్శాంతికి లోటురాదు.

*స్త్రీలు గురు, శుక్రవార నియమములు, గణపతి, లక్ష్మీ, సాయి పూజలు ఆచరించిన, గృహమందలి ఒడుదుడుకులు తొలగును. భర్త, పుత్ర సౌఖ్యము, ఋణవిముక్తి (గర్భిణీలు సుఖ ప్రసవాలు) శాంతి కలుగును.*

★ ★ ★ ★

# మకరరాశి



*ఉత్తరాషాఢ : **2, 3, 4** పాదములు, శ్రవణం : **1, 2, 3, 4** పాదములు, ధనిష్ఠ : **1, 2** పాదములు*

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - **5** | వ్యయం | - **5** |
| రాజపూజ్యం | - **3** | అవమానం | - **3** |

*ఈ రాశివారికి గురుడు యీ సంవత్సరకాల ఆరంభం నుండి జూన్ **16** వరకు పంచమ స్థానమందు రజితమూర్తి. తదుపరి కాలము నుండి సంవత్సరాంతము వరకు షష్ఠ స్థానము నందు సువర్ణమూర్తి. శని యీ సంవత్సరము పంచమ స్థానమందు లోహమూర్తిగా సంచారము చేయును. రాహువు యీ సంవత్సర కాలము నుండి ఫిబ్రవరి **16** వరకు షష్ఠ స్థానమందు కేతువు ద్వాదశ స్థానమందు తామ్రమూర్తులు. తదుపరి కాలము నుండి సంవత్సరాంతము వరకు రాహువు పంచమ స్థానమందు కేతువు లాభస్థానమందు సువర్ణమూర్తులు.*

గురుడు యీ సంవత్సర ఆది నుండి జూన్ 16 వరకు పంచమ స్థానము నందు సంచారము చేయును. యీ సంచారము మిక్కిలి శుభయుక్తముగా వుండును. యీ కాలమునందు సంఘము నందు గౌరవము పెరుగుట, పెద్దల ఆదరణ, చక్కటి వ్యవహార జ్ఞానము కలిగి పుత్ర సహకారముతో కార్యజయము కలుగును. అవసరమునకు తగిన ధనము సమకూరును. సందర్భమునకు తగిన ఆలోచనా పరిజ్ఞానము కలిగి వుందురు. భూ, గృహ లాభములు వుండును. ప్రయాణములు అనుకూలించును. గృహమందలి వాతావరణము ఆహ్లాదకరముగా వుండును. పుణ్య కథా శ్రవణము, తీర్థ యాత్రలు చేయుదురు.

తదుపరి కాలము నుండి సంవత్సరాంతము వరకు యీ గురుడు షష్ఠరాశిలో సంచారము చేయును. ఈ కాలము నందు శుభాశుభ ఫలములు ఇచ్చును. తలచిన కార్యములు ఆలస్యములు అయిననూ, ప్రయత్న పూర్వకము ద్వారా నెమ్మదిగా నెరవేరును. ధన వ్యయము, మాతృవర్గము రీత్యా అనారోగ్యము, స్థాన చలనములు వుండును. మనస్సుకు కష్టము కలిగించు సంఘటనలు జరుగు అవకాశములు కలవు. శుభ పుణ్య కార్యములు నిలిచియుండును. గృహ నిర్మాణాదులు కలిసివచ్చును. కుటుంబ పరిస్థితులందు క్రమేణా మార్పులు గోచరించును. కళత్రమునకు సంతానమునకు అనారోగ్య సూచనలు కలవు.

శని యీ సంవత్సరమంతా పంచమ స్థానమందు సంచారము చేయును. యీ కాలమునందు మిశ్రమ ఫలితములు ఎక్కువగా వుండును. శరీరశ్రమ, అకాల భోజనము, వృథా ప్రయాసలు వ్యవహార నష్టములు వుండును. ఇంటి యందు శుభ కార్యములు మొదట వాయిదా పడి తర్వాత పూర్తి అగు సూచనలు కలవు. కొన్ని సంఘటనలందు మంద బుద్ధి ప్రదర్శింతురు. తద్వారా మనస్థాపము కలుగును. క్రూరబుద్ధి, నాస్తికత్వము, ఉదరవ్యాధి, బంధు మిత్రవైరము కలిగి వుందురు. భవిష్యత్ గురించి భీతి, రకరకాల ఆలోచనలు కలిగి వుందురు. అభివృద్ధి పథము వైపు పయనించుట కొరకు ఋణగ్రస్తులగుట జరుగును. అయినను రాహుకేతు సంచారము అనుకూలముగ వుండి శుభములు ప్రోత్సహించును. కోర్టు వ్యవహారములు, ప్రభుత్వ వ్యవహారములు అనుకూలముగా ముగించగలరు. శత్రుజయము కలుగును. దేహపీడ, దంతములకు సంబంధించిన అనారోగ్యముతో బాధపడుదురు. కార్యదీక్ష, మంచి పట్టుదల, ఆధ్యాత్మిక స్థితి, దేవ, బ్రాహ్మణ భక్తి కలిగి వుందురు.

విద్యార్థులు అత్యధిక శ్రద్ధ ఉన్నకాని ఉత్తీర్ణులు కాలేరు. వ్యవసాయదారులకు పూర్వార్థము అనుకూలముగా, ఉత్తరార్థమున మిశ్రమముగా వుండును. వ్యాపారస్తులకు ఉత్తరార్థము లాభసాటిగా వుండును. కిరాణా, ఫ్యాన్సీ, కాగితము, కోళ్ళ పరిశ్రమవారలకు సామాన్యముగా వుండును. కలప, నూనె, యంత్ర వ్యాపారములకు, వస్త్ర పరిశ్రమ వారికి అనుకూలముగా ఉన్నది. ఉపాధ్యాయులకు, కళాకారులకు, గాయకులకు, పూర్వార్థము అనుకూలము. రియల్ ఎస్టేట్, షేర్లు, ఆర్థిక లావాదేవీలు, నిర్వహించువారికి ఉత్తరార్థము బలముగా వుండును.

4, 5 మాసములందు క్రూరత్వమును, భయము, ఔషధసేవలు కలుగుచుండును. అంగారకకేతు జపములు స్తోత్రములు జరిపించేది. 6, 7 మాసములందు కళాకళలగును, కొంతవరకు వృద్ధిగాను వుండును. వ్యవహార పటుత్వము కోల్పోవుట, శుభాదులందు మాట తొందర కూడదు. 8, 9 మాసములందు నిదానించిన భూ, గృహ శుభములు ఉద్యోగ లాభములు ఉన్నతాధికార స్నేహములు, శుభ ధన లాభ వ్యయములు కలుగును. చాలావరకు మంచిది. 10, 11 మాసములందు శని, గురు వక్రములచే కుజ సంచారముచే మిశ్రమ ఫలితములందగలరు. విశేష లాభములు కూడా ఆర్జింతురు. మిగిలిన మాసములందు కొన్ని సమస్యలుత్పన్నమగు చుండిననూ, ఆర్థిక ఋణ భారములు మోయవలసి వచ్చుచుండిననూ భవిష్యత్తు బంగారం కాగలదు.

మొత్తం మీద యీ రాశివారికి యీ సంవత్సరం చాలా వరకు వృద్ధి కనిపించుచున్నది. మంగళ, శుక్రవార నియమములు, పగడము, వజ్రములు ధరించుటచే అన్ని రంగముల వారికి ఈ సం॥రం విశేషముగా వుండును.

**ఉత్తరాషాఢ నక్షత్రము వారు వజ్రము ధరించిన మంచిగా ఉండును. శ్రవణం నక్షత్రము వారు ముత్యము, పచ్చ ధరించుట, మంగళవార నియమములు చేయుట మంచిది. ధనిష్ఠవారు పగడం, నీలం ధరించుట, రుద్రాభిషేకము చేయించుట వలన యత్న ఫలసిద్ధి కలుగును.**

***స్త్రీలు శని, శుక్రవార నియమములు, రాజరాజేశ్వరి, శివస్తోత్ర పారాయణము వలన కుటుంబము నందు సౌఖ్యము, ఆరోగ్యము, ఋణవిముక్తి, భర్తృ, పుత్ర సౌఖ్యము, (గర్భిణీ సుఖప్రసవం) శాంతి కలుగును.***

★★★★



# కుంభరాశి

***ధనిష్ఠ : 3, 4 పాదములు, శతభిషం : 1, 2, 3, 4 పాదములు, పూర్వాభాద్ర : 1, 2, 3 పాదములు***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | - | 5 | వ్యయం | - | 5 |
| రాజపూజ్యం | - | 6 | అవమానం | - | 3 |

*ఈ రాశివారికి గురుడు సంవత్సర ఆరంభము నుండి జూన్ **16** వరకు చతుర్థ స్థానమందు లోహమూర్తి. తదుపరి జూన్ **16** నుండి సంవత్సర అంతము వరకు పంచమ స్థానమందు రజితమూర్తి. శని యీ సంవత్సర మంతయు చతుర్థ స్థానమందు సువర్ణమూర్తిగా సంచారము చేయును. రాహువు యీ సంవత్సర ఆరంభము నుండి ఫిబ్రవరి **16** వరకు పంచమ స్థానమందు కేతువు లాభస్థానమందు సువర్ణమూర్తులు. తదుపరి కాలము ఫిబ్రవరి **17** నుండి రాహువు చతుర్థ స్థానమందు, కేతువు దశమ స్థానమందు రజితమూర్తులు.*

గురుడు యీ రాశివారికి సంవత్సర ప్రారంభము నుండి జూన్ 16 వరకు చతుర్థ స్థానమందు సంచారము చేయును. యీ కాలము శుభాశుభ మిశ్రమముగా వున్నది. యీ కాలములో తలచిన కార్యములకు ప్రారంభమున ఆటంకము కలిగిననూ, శుభముగా నెరవేరును. భూ, గృహ నిర్మాణాదులకై చేయు ప్రయత్నములు ఫలించుట, అవసరమునకు తగిన ధనము సమకూరుట వుండును. శరీర శ్రమ, త్రిప్పుట, అకాల భోజనము, ఉద్యోగ ప్రయత్నములు చివరిదశలో సాఫల్యత కలుగుట వుండును. దూర ప్రయాణములు అనుకూలించును. తదుపరి కాలము జూన్ 16 నుంచి సంవత్సర అంతము వరకు పంచమ స్థానమందు సంచారము చేయును. యీ సంచార కాలము మిక్కిలి యోగదాయకముగా వున్నది. యీ సంచార కాలమునందు పూర్వార్థము కంటె ఉత్తరార్థము మిక్కిలి శుభదాయకముగా, సంఘము నందు గౌరవములు, అధికార వృద్ధియు కలుగును. గతంలో ఏర్పడిన ఇబ్బందులు తొలగి క్రమేణా శుభ ఫలితములు కలుగును. గృహ వాతావరణము ప్రోత్సాహకరముగా వుండును. పుత్ర లాభము, సంతానము వలన ఆనందము, దైవ చింతన, పుణ్య కథా శ్రవణము, తీర్థయాత్రలు చేయుదురు. ధన లాభము కలుగును. బంధు మిత్రుల సమాగమముతో మనస్సుకు

సంతోషకరముగా వుండును. తలపెట్టిన శుభకార్యములు అన్నీ పూర్తి చేయగలరు. భవిష్యత్ గురించి క్రమబద్ధమైన ప్రణాళికలను రూపొందించగలరు.

శని సంవత్సరమంతయు చతుర్థమున దశగవెలుగొందును. స్థాన దోషముచే అస్థిమితములున్ననూ చాలా యోగప్రదము. స్థిరములు, శుభములు, ధనవృద్ధి కలిగించును. తద్వారా ధన వ్యయము కలుగును. సుఖమునకై ఆరాటపడుట, అకాల భోజనము, శరీరశ్రమ, త్రిప్పుట, మనోభీతి మొదలగు ఫలితములు పొందుదురు. పితృ ధనవ్యయము, బంధువైరము, మాతా పితృ బాధ, గృహ, వాహన నష్టములు వుండును. ధనమునకు లోటురాదు. భవిష్యత్ గురించి అనవసర ఆందోళనలు పడుదురు. బంధుమిత్రులలో ఒకరికి వీడ్కోలు పలికెదరు. పూర్వ ధన వ్యయము చేయుదురు. వృధా ప్రయాసలకు గురి అగుదురు. లగ్నాధిపతి గాన అపకారము నివ్వజాలడు.

4, 5 మాసములందు బంధు మిత్ర సమాగమములు, కార్యనిమఘ్నత. శుభనిర్వహణములు, స్థాన చలనములు. అయత్న ధన లాభములు. కృషిమూల ధన లాభములు కలుగుచుండును. సమస్యలు సామరస్యములగును. 6, 7 మాసములందు శతృవ్యయము, పుత్రాది ఆరోగ్యవృద్ధి, స్వల్ప ఆరోగ్య లోపములు, చేయు పనులందు మొదట ఆటంకములు తరువాత ఫలితములు కలుగును. వ్యవహారములకై ఇతరులను నమ్మరాదు. 8, 9 మాసములందు మనోవ్యధ, స్వల్ప ఆరోగ్య లోపములు వుండును. వ్యాపారములు, శుభాధి కృషి అనుకూలములు. సంతానాది జయము. సుకుమారత్వం కలుగును. 10, 11 మాసములందు భూ గృహ, స్థాన లాభములు, శుభ ప్రయత్నములకు ఆటంకము. ఆభరణ లాభములు కలుగును, కానీ చోర బాధలుండవచ్చును. మిగిలిన మాసములందు అంగారక గురు సంచారములనుకూలించి తీర్థ యాత్రాది పుణ్యక్షేత్ర సందర్శనములు, నూతన వ్యాపార ప్రారంభములు. కృషి మూలార్జన లాభములు కలుగుచుండును. చాలా వృద్ధికరమైన కాలముగ ఎంచవలెను. ఆరోగ్య వ్యాపార, వ్యవసాయ రంగములందు పురోభివృద్ధి సాధించుచు ప్రయాణింతురు. బాహుమనోబలము, సోదరప్రేమ కలిగి వుందురు.

విద్యార్థులకు యీ సంవత్సర అంత్యకాలము యోగదాయకముగా వున్నది. వ్యవసాయదారులకు పూర్వార్థము మేలు. ఉత్తరార్థములో నష్టములు పొందుదురు. వ్యాపారస్తులకు పూర్వార్థము అనుకూలము. ఉత్తరార్థములో ప్రథమ భాగము మిశ్రమ ఫలితము. తదుపరి కాలము శుభప్రదముగా వున్నది. విదేశీ ప్రయాణములు అనుకూలించును. కిరాణా, ఫ్యాన్సీ, చర్మ, తైల, కోళ్ళ పరిశ్రమల వారికి, యంత్ర, ఇనుము వారికి అనుకూలము. గాయకులకు, కళాకారులకు ఉపాధ్యాయులకు మిశ్రమ ఫలితములు. షేర్లు, ఆర్థిక వ్యవహారములు నడిపేవారికి, రియల్ ఎస్టేట్ రంగము వారికి ఉత్తరార్థము మేలు.

ధనిష్ఠ నక్షత్రము వారు పగడము ధరించుటచే గతం కంటే పురోభివృద్ధి. శతభిషం వారు గోమేధికము, పూర్వాభాద్ర నక్షత్రము వారు పుష్యరాగము, పగడం ధరించిన మేలు కలుగును.

మొత్తంమీద యీ రాశివారు గురు, శనులకు జపములతో బాటు మహామృత్యుంజయ జపములు చేయించుట, శనీశ్వర తైలాభిషేకము, ఈశ్వరారాధన, ఆలయ ప్రదక్షిణలు చేసిన అపమృత్యు దోషము తొలగి శుభములనందగలరు.

***స్త్రీలు గురు, శుక్రవారములు, సుబ్రహ్మణ్య అభిషేకములు, సూర్యారాధన చేసిన గృహమునందు ఉత్సాహము వృద్ధి కలుగును.***

★★★★



# మీనరాశి

**పూర్వాభాద్ర : 4వ పాదము, ఉత్తరాభాద్ర : 1, 2, 3, 4 పాదములు, రేవతి : 1, 2, 3, 4 పాదములు**

| ఆదాయం | - | 2 | వ్యయం | - | 11 |
|---|---|---|---|---|---|
| రాజపూజ్యం | - | 2 | అవమానం | - | 6 |

*ఈ రాశివారికి గురుడు జూన్ 16 వరకు తృతీయమందును, తదుపరి చతుర్థమందును సువర్ణమూర్తి. శని ఈ సంవత్సరమంతా తృతీయ మందు రజితమూర్తి. రాహువు ఫిబ్రవరి 16 వరకు 4ట, కేతువు 10ట రజితమూర్తులు. తదుపరి ఫిబ్రవరి 16 నుండి 3ట రాహువు, 9ట కేతువు సువర్ణమూర్తులు.*

గురుడు యీ రాశివారికి సంవత్సరం ఆది నుండి జూన్ 16 వరకు తృతీయ మందు సంచారము చేయును. యీ కాలములో శుభఫలములు ఎక్కువగా పొందుదురు. అన్ని రంగముల వారికి యోగదాయకముగా వుండును. ఆకస్మిక ధన లాభమును పొందెదరు.

నిరుద్యోగులకు ఉద్యోగ ప్రయత్నములు అనుకూలించును. ఇష్టకార్య సిద్ధి కలుగును. సోదరులలో మైత్రి బంధము బలపడును. సోదరులకు ఇది మంచి కాలముగా వుండును. పెద్దల ఆదరణ, వ్యవహార జ్ఞానము కలిగి వుందురు. ఆర్థిక లావాదేవీలు సంతృప్తికరముగా సాగును. నూతన ప్రయత్నములు ఫలించును. జూన్ 16 నుండి యీ గురుడు సంవత్సరాంతము వరకు చతుర్థ స్థానమందు సంచారము చేయును. ఈ కాలము మిశ్రమ ఫలితములను ఇచ్చును. ప్రతి పనిలో సహనమును ప్రదర్శించవలెను. కుటుంబ వాతావరణములో స్వల్ప మార్పులు, చేర్పులు జరుగును. మాతృవర్గము వారితో విరోధము, అభిప్రాయ బేధములు కలుగును. శయ్యా సౌఖ్యము లోపించుట వుండును. వాహన చోదకులు జాగ్రత్తగా వ్యవహరించవలెను. భూ, గృహ నిర్మాణములు కలసి వచ్చును. మ్లేచ్ఛ సహవాసము కలుగును. కపట స్వభావముతో వ్యవహరించెదరు. స్థిరాస్థి వృద్ధి యగును.

శని యీ సంవత్సరమంతా తృతీయమందు సంచారము చేయును. ఈ సంచారము మిక్కిలి యోగదాయకముగా వుండును. స్వకీయ బలము, వాక్పటుత్వము, కీర్తి, గౌరవము, సత్యవాక్కు కలిగి వుందురు. తలచిన కార్యములన్నీ పూర్తి అగును. అనాయాస ధన లాభము, బంధు మిత్ర సమాగమము కలుగును. కుటుంబము నందు శుభ పుణ్య కార్యాచరణ, ఉద్యోగ ప్రయత్నములు ఫలించును. గతంలో వున్న ధన ఇబ్బందులన్నీ తొలగి కొంత మాత్రమైనా ధనమును నిల్వ చేయుటకు అవసరమగు ధనాదాయ మార్గములు లభించును. కార్యదక్షత కలిగి వుందురు. భూ, గృహ నిర్మాణాదులు కలసి వచ్చును. మృష్టాన్న భోజనము, మనస్సుకు సంతోషము కలుగును. నూతన వస్త్ర లాభము, విచిత్ర వస్తు సేకరణ, నూతన ప్రయత్నములు ఫలించుట, సాహస కార్యములు అనుకూలము భవిష్యత్ గురించి చేయు ఆలోచనలన్నీ కార్యసాఫల్యత పొందును.

ఏప్రిల్ , మే లందు కుజ, గురుల సంచారముచే వ్యవహార లాభము, దైవక్షేత్ర సందర్శనము. పుణ్య, దాన, కార్యాసక్తత కలుగును. ధనమునకు లోటురాదు. సరిహద్దు తగాదాలు రాగలవు. శుభకార్య నిర్వహణలు ప్రయత్నములు ఫలించును. 6, 7 మాసములందు భాగ్యవ్యయము, సుసంపన్న కార్యవ్యయము. పరపీడనము, ఆరోగ్య అస్థిమితములుండును. జపశాంతులు ద్వారా శాంతించును. 8, 9 మాసములందు సింహ పరాక్రమము, యత్నకార్య లాభము, చేయు పనులందు సంతృప్తి కలుగును. శుక్ర సంచారముచే అలంకార వస్తు ప్రాప్తి, స్త్రీ లోలత్వము, అతిసుకుమారత్వము కలుగును. కొద్ది భూ లాభములుండును. 10, 11 మాసములందు భూ, శుభ లాభములు, విద్యా ఉద్యోగ విజయములు, బంధు మిత్ర సమాగమములు, మృష్టాన్న భోజనము, ఆధ్యాత్మిక చింతన కలుగును. అనుకూలమైన కాలము. 12, 1 మాసములందు గృహమునకు, శరీరమునకు ఖర్చులు, మనస్తత్వములు, మిశ్రమములు. నిదానముచే మనోవేదనలు, అవమానములు తొలగును. ప్రతిష్ఠ పెరుగును. మిగిలిన కాలము ఛాయాగ్రహానుకూలముచే వ్యాపార లావాదేవీలు నివారింపబడి అభి వృద్ధి కలుగును. బంధుప్రేమ, యత్న కార్యసిద్ధి, ఉత్సాహము, విద్యా ఉద్యోగ లాభములు కలుగుచుండును. సంవత్సరాంతమందు అంగారక దోషముచే శత్రు లోహరీత్యా ప్రమాదములు, బహు ధన వ్యయము, తస్కరభీతి, నేత్రరోగము, కార్యవిఘ్నము, రక్త దర్శనము, స్త్రీ సంబంధ వైరములు మున్నగు ఫలితములుండును.

విద్యార్థులకు యిది మంచి కాలము. శ్రమకు తగిన ఫలితములుండును. ఇంజినీరింగ్,వైద్య రంగములోని వారికి ప్రోత్సాహకరముగా వుండును. విదేశీ ప్రయాణములు అనుకూలించును. వ్యవసాయదారులకు ఉత్తరార్థము మేలు. వ్యాపారస్థులకు సంవత్సరమంతా లాభించి నూతన వ్యాపార ప్రయత్నములు అనుకూలించును. ఇనుము, తైలము, బొగ్గు పరిశ్రమలవారికి లాభములు ఎక్కువ. కిరాణా, ఫ్యాన్సీ, కోళ్ళ పరిశ్రమలకు అధిక శుభ ఫలములు, ఉపాధ్యాయులకు, గాయకులకు, కళాకారులకు మిశ్రమ ఫలితములు వుండును. మత్స్య పరిశ్రమ, వస్త్ర పరిశ్రమ, రియల్ ఎస్టేట్ వారికి అనుకూల కాలము.

మొత్తంమీద ఈ రాశివారు  గురు, రాహు కేతువులకు జపములు, రుద్రాభిషేకములు, దుర్గా సుబ్రహ్మణ్య జపాభిషేకములు, నవగ్రహ శాంతులు ఆచరించవలెను.

**పూర్వాభాద్ర నక్షత్రము వారు ముత్యము, పుష్యరాగము ధరించిన మేలు కలుగును. ఆరోగ్యవృద్ధి, ప్రశాంతత, కుటుంబ వృద్ధి కలుగును. ఉత్తరాభాద్ర నక్షత్రము వారు నీలము ధరించిన మేలు కలుగును. రేవతి నక్షత్రము వారు నీలము ధరించిన మేలు కలుగును. పచ్చ ధరించిన అశాంతి తొలగును.**

***స్త్రీలు గురువారములు, మంగళవారములు, సాయి పూజలు, శివ ఆంజనేయ సహస్రములు, దుర్గా పారాయణము చేయుట ద్వారా గృహమందు శాంతి ఆరోగ్యములు కలుగును. ఆర్థిక వృద్ధి భర్తృ పుత్ర సౌఖ్యములు కలుగును.***

★★★★

# వివాహాది శుభముహూర్తములు

ఇందు బాహుళ్యముగ శుభముహూర్తములను నిర్ణయించి వ్రాసితిని. ఇందు వ్రాయబడిన వానికి స్వల్ప దోషములున్నను వాటికి పరిహారములను గమనించియే వ్రాయబడినవి. ఏకవింశతి మహాదోషములు, ఉపదోషములు, మీన, చైత్ర, లత్తా, వేధలు మున్నగు వాటికిని దేశవ్యవస్థలను గమనించి వ్రాయబడినవి. కేవలము నిర్దుష్టమగు లగ్నములు సంవత్సరమునకు 3,4 గూడ దొరకుట కష్టము. సుప్రసిద్ధ సిద్ధాంతులును చిరకాలమునుండి గుణదోషములను నిరూపణ చేయుటయు, వ్రాయుటయు గలదు. మరియు ప్రజాబాహుళ్యమునకు ఉపయోగించుకొనుటకు కొంతవరకు ముహూర్తములు వ్రాయబడినవి. సహృదయులు వాటిని గమనించి క్షీరనీర న్యాయముగా గ్రహించి ఆచరణ యోగ్యములగు వాటిని ప్రజలకు అందచేయవలసినదిగా మనవి చేయుచున్నాను. – పంచాంగకర్త.

## శుభముహూర్తాని

### చైత్రమాసము (26-3-2001 నుండి 23-4-2001 వరకు)

మార్చి 26 సోమ. శుక్ల ప్రతిపత్. రేవతి. వత్సరాదిత్వేన నవవస్త్రాభరణధారణ, రాజదర్శనాదీనాం మిధునే శుభ నవాంశకాలః ఉ.గం. 11-06.

30 శుక్ర. షష్ఠి. రోహిణి. డోలారోహణస్య సింహోర సా.గం. 4-43.

31 శని. సప్తమి. మృగశిర. డోలారోహణస్య కర్కాటకోర ప.గం. 1-29.

ఏప్రిల్ 3 మంగళ. దశమి. పుష్యమి. కర్కాటకోర ప.గం. 12-59.

15 ఆది. సప్తమి. ఉ.షా. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కర్కాటకోర ప.గం. 12-30, సింహోర ప.గం. 3-37. వివాహ గృహప్రవేశాదీనాం కుంభోమతాంర తె.గం. 3-59.

18 బుధ. దశమి. ధనిష్ఠ. డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహోర ప.గం. 3-26.

### వైశాఖమాసము (24-4-2001 నుండి 23-5-2001 వరకు)

26 గురు. శు.తృతీయ. రోహిణి. అన్నప్రాశన ఉపనయనాక్షర స్వీ. వివాహక్రయ విక్రయాదీనాం కర్కాటకే శుభ నవాంశ కాలః ఉ.గం. 11-25 (దశమే రవిః) వివాహ గృహప్రవేశాదీనాం కుంభోర రా.గం. 3-15.

27 శుక్ర. చతుర్థి. మృగశిర. డోలారోహణ వ్యాపారాదీనాం కన్యార సా.గం. 4-24

28 శని. పంచమి. పునర్వసు. గృహారంభస్య కుంభోర రా.గం. 3-07.

30 సోమ. సప్తమి. పుష్యమి. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార, గృహారంభ ప్రవేశ వ్యాపారాదినాం కర్కాటకోర ఉ.గం. 11-30 దశమేరవిః).

మే 4 శుక్ర. ద్వాదశి. ఉత్తర. డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహోమతాంర ప.గం. 2-23.

5 శని. త్రయోదశి. హస్త. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కన్యామతాంర సా.గం. 3-54.

6 ఆది. చతుర్దశి. చిత్త. అన్నప్రాశనస్య కర్కాటకశ్చోరః ఉ.గం. 10-8. స్వాతి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కన్యామతాంర సా.గం. 3-50. వివాహస్య కుంభోర రా.గం. 2-35.

7 సోమ. పూర్ణిమ. స్వాతి. లన్నప్రాశన గృహారంభ వ్యాపారాదీనాం కర్కాటకోర ఉ.గం. 11-4.

12 శని. పంచమి. ఉ.షా. వివాహస్య కుంభోర రా.గం. 2-14.

13 ఆది. షష్ఠి. ఉ.షా. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహవాణిజ్యాదీనాం కర్కాటకోర ఉ.గం. 10-40. డోలారోహణవ్యాపారాదీనాం కన్యార సా.గం. 3-23.

జ్యేష్ఠమాసము (24-5-2001 నుండి 21-6-2001 వరకు)

25 శుక్ర. శు.తదియ. మృగశిర. అన్నప్రాశనోపనయనాక్షర స్వీ. వివాహ వ్యాపారాదీనాం కర్కాటకోర ఉ.గం. 9-52 (రిఃఫ చంద్రః). ఆర్ద్ర. గర్భాధానస్య మకరోర రా.గం. 11-9.

26 శని. చవితి. పునర్వసు. డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహోర ప.గం. 12-56. కన్యార ప.గం. 2-30.

27 ఆది. పంచమి. పుష్యమి. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార యాత్రాక్రయవిక్రయాదీనాం కర్కాటకోర ఉ.గం. 9-44. లగ్న చంద్రః గర్భాధానస్య మకరో మతాంర రా.గం. 10-51. గృహప్రవేశస్య కుంభోర రా.గం. 1-13.

జూన్ 2 శని. ఏకాదశి. చిత్ర.డోలారోహణస్య కన్యార ప.గం. 2-3.

3 ఆది. ద్వాదశి. స్వాతి. అన్నప్రాశనస్య కర్కాటకశ్చోరః ఉగం. 9-27. డోలారోహణస్య సింహోర ప.గం. 12-24.

9 శని. బ.తదియ. ఉ.షా. తులార సా.గం. 4-23.

10 ఆది. చవితి. శ్రవణం. డోలారోహణస్య కన్యార ప.గం. 1-32.

15 శుక్ర. నవమి. ఉ.భా. డోలారోహణస్య తులార సా.గం. 3-59.

16 శని. దశమి. రేవతి. అన్నప్రాశనస్య కర్కాటకోర ఉ.గం. 8-26. డోలారోహణస్య తులామతాంర సా.గం. 4-05.

17 ఆది. ఏకాదశి. అశ్విని. అన్నప్రాశనస్య సింహోర ప.గం. 11-31.

ఆషాఢమాసము (22-6-2001 నుండి 20-7-2001 వరకు)

23 శని. శు.విదియ. పునర్వసు. అన్నప్రాశనస్య సింహోర ఉ.గం. 11-8. డోలారోహణస్య తులార సా.గం. 3-29.

24 ఆది. తదియ. పుష్యమి. అన్నప్రాశనస్య సింహోమతాంర ఉ.గం. 11-4.

27 బుధ. సప్తమి. ఉత్తర. డోలారోహణస్య తులార ప.గం. 3-23.

30 శని. దశమి. స్వాతి. డోలారోహణస్య తులార ప.గం. 3-02.

జూలై 8 ఆది. బ.తృతీయ. శ్రవణం. అన్నప్రాశనస్య సింహోమతాంర ప.గం. 10-8. డోలారోహణస్య కన్యార ప.గం. 11-42.

9 సోమ. చతుర్థి. ధనిష్ఠ. అన్నప్రాశనస్య సింహోర ఉ.గం. 10-4. డోలారోహణస్య కన్యామతాంర ఉ.గం. 11-38. తులార ప.గం. 2-26.

**12 గురు. సప్తమి. ఉ.భా. కన్యామతాంర ఉ.గం. 11-27.**

శ్రావణమాసము (21-7-2001 నుండి 19-8-2001 వరకు)

22 ఆది. శు.విదియ. మఘ. వివాహస్య మీనోమతాంర రా.గం. 10-19.

25 బుధ. పంచమి. ఉత్తర. అన్నప్రాశన వివాహ గృహప్రవేశ క్రయవిక్రయాదీనాం సింహోమతాంర ఉ.గం. 9-2. గృహారంభోపికన్యార ఉ.గం. 10-36. హస్త. వివాహ గర్భాధానాదీనాం మీనో వసుః రా.గం.10-05.

26 గురు.షష్ఠి. హస్త. డోలారోహణ వ్యాపారాదీనాం తులార ప.గం. 1-19.

27 శుక్ర. సప్తమి. స్వాతి. అన్నప్రాశన గృహారంభ ప్రవేశ వ్యాపారాదీనాం కన్యార ఉ.గం. 10-28.

29 ఆది. దశమి. అనూరాధ. వివాహగర్భాదాన గృహప్రవేశాదీనాం కుంభోర రా.గం. 9-07. మీనోమతాంర రా.గం. 9-51.

30 సోమ. ఏకాదశి. అనూరాధ. అన్నప్రాశన గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం కన్యార ఉ.గం. 10-17.

ఆగష్టు 1 బుధ. త్రయోదశి. మూల. అన్నప్రాశన వివాహ వ్యాపారాదీనాం సింహోర ఉ.గం. 8-36. గృహారంభోపి కన్యామతాంర ఉ.గం. 10-9. పూ.షా. గర్భాధానస్య కుంభోర రా.గం. 8-56. మీనోర రా.గం. 9-40.

**2 గురు. చతుర్దశి. ఉ.షా. వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం మీనోర రా.గం. 9-36.**

3 శుక్ర. చతుర్దశి. శ్రవణం. అన్నప్రాశన వివాహ గృహారంభ ప్రవేశ వ్యాపారాదీనాం కన్యార ఉ.గం. 10-02. శ్రవణం. వివాహస్య కుంభోర రా.గం. 8-48.

4 శని. పూర్ణిమ. శ్రవణం. వివాహస్య కుంభోర రా.గం. 8-44. ధనిష్ఠ. వివాహస్య మీనోర రా.గం. 9-28.

5 ఆది. బ.పాడ్యమి. ధనిష్ఠ. అన్నప్రాశన వివాహ గృహప్రవేశాదీనాం సింహోర ఉ.గం. 8-20. గృహారంభోపి కన్యామతాంర ఉ.గం. 9-54.

8 బుధ. చవితి. ఉ.భా. అన్నప్రాశన వివాహ గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం కన్యామతాం ర ఉ.గం. 9-41.

9 గురు. పంచమి. రేవతి. అన్నప్రాశన వివాహ గృహారంభప్రవేశ క్రయవిక్రయాదీనాం కన్యార ఉ.గం. 9-37.

10 శుక్ర. షష్ఠి. అశ్విని. వివాహస్య మీనో మతాంర రా.గం. 9-04.

13 సోమ. నవమి. రోహిణి. గర్భాధాన గృహప్రవేశాదీనాం కుంభోర రా.గం. 8-07.

భాద్రపదమాసము (20-8-2001 నుండి 17-9-2001 వరకు)

22 బుధ. చవితి. హస్త. డోలారోహణస్య మకరో రాజా సా.గం. 5-10.

23 గురు. పంచమి. చిత్త. డోలారోహణస్య మకరోర సా.గం. 5-07.

24 శుక్ర. షష్ఠి. స్వాతి. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 11-25.

26 ఆది. అష్టమి. అనూరాధ. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 8-30 తులామతాంర ఉ.గం. 11-17.

31 శుక్ర. త్రయోదశి. శ్రవణం. డోలారోహణస్య మకరోమతాంర సా.గం. 4-35.

అధిక ఆశ్వయుజమాసము (18-9-2001 నుండి 16-10-2001 వరకు)

సెప్టెం. 19 బుధ. శు.విదియ. చిత్త. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 9-42.

20 గురు. తదియ. స్వాతి. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 9-38.

26 బుధ. నవమి. ఉ.షా. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 9-15.

27 గురు. దశమి. శ్రవణం. డోలారోహణస్య కుంభోమతాంర సా.గం. 5-11.

30 ఆది. త్రయోదశి. శతభిషం. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 8-59. డోలారోహణస్య మకరోర ప.గం. 2-37.

అక్టోబరు 4 గురు. బ.విదియ. అశ్విని. అన్నప్రాశనస్య తులాచోరః ఉ.గం. 8-43.

నిజఆశ్వయుజమాసము (17-10-2001 నుండి 15-11-2001 వరకు)

21 ఆది. పంచమి. మూల. డోలారోహణ వ్యాపారాదీనాం కుంభోర ప.గం. 3-36.

24 బుధ. అష్టమి. ఉ.షా. డోలారోహణ క్రయ విక్రయాదీనాం కుంభోమతాంర ప.గం. 3-23. మీనోర ప.గం. 4-08.

25 గురు. నవమి. శ్రవణం. డోలారోహణ వ్యాపారాదీనాం మీనోర ప.గం. 4-04.

26 శుక్ర. దశమి. ధనిష్ఠ. విజయదశమీత్వేన నూతన వ్యాపారాదీనాం విజయముహూర్తకాలః ప.గం. 2-03. కుంభోర ప.గం. 3-17.

27 శని. ఏకాదశి. శతభిషం. నూతన వ్యాపారాదీనాం కుంభోమతాంర ప.గం. 3-13.

29 సోమ. త్రయోదశి. ఉ.భా. ధనూర ఉ.గం. 11-12.

31 బుధ. చతుర్దశి. అశ్విని. నూతన వ్యాపారాదీనాం మీనోర ప.గం. 3-41.

నవంబరు 3 శని. బ.విదియ. రోహిణి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కుంభోర ప.గం. 2-45. మీనోర ప.గం. 3-29.

4 ఆది. తదియ. మృగశిర. వివాహస్య కన్యామతాంర తె.గం. 3-53.

7 బుధ. సప్తమి. పుష్య నూతన వ్యాపారాదీనాం మీనోమతాంర ప.గం. 3-11.

## కార్తీకమాసము (16-11-2001 నుండి 14-12-2001 వరకు)

18 ఆది. శు.తదియ. మూల. ధనూర ఉ.గం. 9-53. డోలారోహణ నూతన వ్యాపారాదీనాం మీనోర ప.గం. 2-29.

21 బుధ. షష్ఠి. శ్రవణం. ధనూర ఉ.గం. 9-39. నూతన వ్యాపారాదీనాం మీనోర ప.గం. 2-17. ధనిష్ఠ. వివాహ గృహారంభప్రవేశాదీనాం కన్యార రా.గం. 2-46. వివాహగృహారంభప్రవేశాదీనాం తులాచోరః తె.గం. 5-34.

22 గురు. సప్తమి. ధనిష్ఠ. వివాహగృహారంభ ప్రవేశాదీనాం కన్యార రా.గం. 2-42. శతభిషం. వివాహగృహారంభాదీనాం తులార తె.గం. 5-30.

25 ఆది. దశమి. ఉ.భా. డోలారోహణస్య కుంభోర ప.గం. 1-17. వివాహ గృహారంభ ప్రవేశాదీనాం కన్యార రా.గం. 2-30.

27 మంగళ. ద్వాదశి. అశ్విని. వివాహగృహారంభాదీనాం తులార తె.గం. 5-9.

28 బుధ. త్రయోదశి. అశ్విని ధనూర ఉ.గం. 9-13.

30 శుక్ర. పూర్ణిమ. రోహిణి. వివాహగృహప్రవేశాదీనాం కన్యార రా.గం. 2-9.

డిశెంబరు 2 ఆది. బ.విదియ. మృగశిర. అన్నప్రాశన వైశ్యోపనయన వివాహ గృహారంభ క్రయవిక్రయాదీనాం మకరోర ఉ.గం. 10-28 (షష్ఠచంద్రః).

5 బుధ. పంచమి. పుష్యమి. అన్నప్రాశనగృహారంభ క్రయవిక్రయ హలకర్మ కూపారంభాదీనాం మకరోర ఉ.గం. 10-15.

## మార్గశిరమాసము (15-12-2001 నుండి 13-1-2002 వరకు)

17 సోమ. శు.తృతీయ. ఉ.షా. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 9-30.

19 బుధ. పంచమి. ఉ.షా. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 9-12.

23 ఆది. అష్టమి. ఉ.భా. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 8-57.

28 శుక్ర. త్రయోదశి. రోహిణి. డోలారోహణస్య మేషశ్చోరః ప.గం. 2-23.

జనవరి 1 మంగళ. విదియ. పుష్యమి. మేషోమతాంర ప.గం. 2-8.

## పుష్యమాసము (14-1-2002 నుండి 12-2-2002 వరకు)

16 బుధ. శు.తదియ. ధనిష్ఠ. అన్నప్రాశనస్య కుంభోర ఉ.గం. 9-49.

17 గురు. చవితి. శతభిషం. అన్నప్రాశనస్య కుంభోర ఉ.గం. 9-45.

21 సోమ. అష్టమి. అశ్విని. అన్నప్రాశనస్య కుంభోర ఉ.గం. 9-33.

24. గురు. దశమి. రోహిణి. డోలారోహణస్య మేషోర ప.గం. 12-31.

ఫిబ్రవరి 4 సోమ. బ.సప్తమి. స్వాతి. డోలారోహణస్య మేషోర ప.గం. 11-53.

6 బుధ. నవమి. అనూరాధ. అన్నప్రాశనస్య కుంభోర ఉ.గం. 8-29.

## మాఘమాసము (13-2-2002 నుండి 14-3-2002 వరకు)

15 శుక్ర. శు.తదియ. ఉ.భా. డోలారోహణస్య కర్కాటకోర సా.గం. 4-25.

22 శుక్ర. దశమి. మృగశిర. డోలారోహణక్రయవిక్రయాదీనాం మిధునం మతాంర ప.గం. 3-01. కర్కాటకోర ప.గం. 3-58.

23 శని. ఏకాదశి. పునర్వసు. గృహారంభస్య ధనూర తె.గం. 3-41.

25 సోమ. త్రయోదశి. పుష్యమి. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార యాత్రా కూపారంభ, క్రయవిక్రయాదీనాం మీనోమతాం చోరః ఉ.గం. 7-59.

మార్చి 1 శుక్ర. బ.విదియ. ఉత్తర. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ ప్రవేశ వ్యాపారాదీనాం మీనోర ఉ.గం. 7-43. హస్త. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మిధునం ర ప.గం. 2-34. వివాహగృహారంభాదీనాం ధనూర రా.గం. 3-6. మకరోమతాంర తె.గం. 4-38.

3 ఆది. పంచమి. స్వాతి. డోలారోహణక్రయవిక్రయాదీనాం కర్కాటకోరప.గం. 3-22. నూతన గృహారంభాదీనాం ధనూరాజా రా.గం. 3-0.

7 గురు. నవమి. మూల. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహగృహారంభక్రయవిక్రయాదీనాం మీనోర ఉ.గం. 7-18.

8 శుక్ర. దశమి. పూ.షా. ఆశ్వలాయనోపనయన కూపారంభాదీనాం మీనోర ఉ.గం. 7-15.

## ఫాల్గుణమాసము (15-3-2002 నుండి 11-4-2002 వరకు)

16 శని. శు.విదియ. రేవతి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మిధునం మతాంర ప.గం. 1-34. కర్కాటకోర ప.గం. 2-30. అశ్విని. వివాహస్య ధనూర రా.గం. 2-6. కుంభోర తె.గం. 5-59.

17 ఆది. తదియ. అశ్విని. నూతనవ్యాపారాదీనాం మిధునం ప.గం. 1-30.

19 మంగళ. పంచమి. రోహిణి. వివాహగృహారంభ ప్రవేశాదీనాం కుంభోర తె.గం. 5-47.

20 బుధ. షష్ఠి. రోహిణి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కర్కాటకోర ప.గం. 2-14. మృగశిర. వివాహ గృహారంభాదీనాం మకరోర రా.గం. 3-23.

23 శని. నవమి. పుష్యమి. గృహారంభప్రవేశాదీనాం కుంభోర తె.గం. 5-32.

24 ఆది. దశమి. పుష్యమి. అన్నప్రాశనోపనయనాదీనాం మిధునే శుభనవాంశ కాలః ఉ.గం. 11-25 ని॥లు (దశమే రవిః). డోలారోహణ క్రయవిక్రయాదీనాం మిధునం ర ప.గం. 1-02.

27 బుధ. చతుర్దశి. ఉత్తర. వివాహ గృహప్రవేశాదీనాం ధనూర రా.గం. 1-22.

29 శుక్ర. బ.పాడ్యమి. చిత్త. గృహారంభప్రవేశాదీనాం కుంభోర తె.గం. 5-7.

30 శని. బ.విదియ. చిత్త. అన్నప్రాశనోపనయన అక్షరస్వీకార గృహారంభప్రవేశ వ్యాపారాదీనాం మిధునం శుభనవాంశ కాలః ఉ.గం. 11-5. స్వాతి. వివాహస్య ధనూర రా.గం. 1-10. వివాహ గృహారంభాదీనాం కుంభోర తె.గం. 5-03.

31 ఆది. తదియ. స్వాతి. డోలారోహణక్రయవిక్రయాదీనాం మిధునం మతాంర ప.గం. 12-34. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార క్రయవిక్రయాదీనాం మిధునే శుభనవాంశకాలః ఉ.గం. 11-0 (దశమే రవిః).

ఏప్రిల్ 3 బుధ. షష్ఠి. మూల. డోలారోహణక్రయవిక్రయాదీనాం కర్కాటకో మతాంర ప.గం. 1-19. వివాహస్య ధనూర రా.గం. 12-55.

5 శుక్ర. అష్టమి. ఉ.షా. వివాహ గృహప్రవేశాదీనాం ధనూర రా.గం. 12-47. వివాహగృహారంభ ప్రవేశాదీనాం కుంభోర తె.గం. 4-41.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

